శ్రీ హయగ్రీవాయ నమః

# బాల వ్యాకరణము

---

పరవస్తు, చిన్నయసూరి ప్రణీతము.

ఇది

ప. వేంకటకృష్ణయ్యా చేత

ముద్రింపించి ప్రకటింపఁబడియె.

**FOURTH EDITION.**

MADRAS:

ED BY W.PUSHPARATHA CHETTY

AT THE KALARATNAKARAM PRESS:

103, *Armenian Street*.

1871.

# పీఠిక

ఆంధ్రభాషకు లక్షణ గ్రంథములు ప్రాచీనులు చేసినవని పెక్కులు కానఁబడుచున్నవి. కొన్ని లక్షణగ్రంథముల పేర్లు మాత్ర మిప్పుడు వినఁబడుచున్నవి. కానఁబడు గ్రంథములందు సంస్కృతసమములకు లక్షణములు బహుతరముగా రచింపఁబడినవి గాని తక్కినభాషకు విశేషాకారముగా రచింపఁబడినవికావు కాఁబట్టి యా లక్షణ గ్రంథములు చదువువారికి నిస్సందేహముగా వచనరచన సేయుకౌశలము చిరకాలము బహులక్ష్యములందుఁ బరిశ్రమము చేయక రానేరాదు. భాషా సమిష్టికి లక్షణగ్రంథము కుదిరిన పక్షమం దంతశ్రమపడఁ బనిలేదు. తుదకు లక్ష్యపరిజ్ఞానము చాలని లక్షణపరిజ్ఞాన మంత శ్లాఘ్యము కాదు గాని తుదముట్ట సర్వలక్షణ పరిజ్ఞానము లక్ష్యపరిజ్ఞానముచేతనే సాధించుట మిక్కిలి దుష్కరము. కాఁబట్టి యిట్టికొఱఁత వారింపఁ బూని పెక్కులక్ష్యములు పలుమాఱు సావధానముఁగా బరిశీలించి రచనాప్రణాళిక నిర్ణయించుకొని నానేర్పుకొలఁదిని సంస్కృతభాషలో సూత్రగ్రంథ మొకటి కావించితిని. ఆ గ్రంథము బాలురకు సుసాధము గాకుండుటవలన దానియందలి సూత్రములు కొన్ని తెనిఁగించి ప్రకృత గ్రంథరూపమున రచించినాఁడ.

క. మానితపునడకపేరిమి
మానసమున కింపుఁ బెంప మనునంచలకున్
బోనిడి నీరసనీరము
జానుగ క్షీరంబు గొనుట సహజముకాదే.

---

శ్రీ హయగ్రీవాయ నమః

క. శ్రీలతకుం బ్రాఁకయి వృష
శైలంబున వెలసి తనదుచాయ కెలయు ధ
న్యాళి దగ మాన్చి కోర్కులు
చాలంగా నొసఁగు కల్పసాలముఁ గొలుతున్.

క. అనయము లలితోక్తులతో
నొనరుపడం గూర్చి లక్ష్యయోజన మొప్పం
గను బాలవ్యాకరణం
బనఁగా లక్షణ మొనర్తు నాంధ్రంబునకున్.

క. దిక్ప్రదర్శనముగఁ దెలిపెద నిందు ల
క్షణము గానఁ బూర్వకవుల లక్ష్య
ములను లాఁతిలక్ష్మములఁ గాంచి తక్కుల
క్షణ మెఱింగి కొనుఁడు చతురమతులు.



శ్రీ హయగ్రీవాయ నమః

బాల వ్యాకరణము.

# సంజ్ఞా పరిచ్ఛేదము.

౧ సంస్కృతమునకు వర్ణము లేఁబది

అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఌ ౡ ఏ ఐ ఓ ఔ అం అః

క ఖ గ ఘ ఙ చ ఛ జ ఝ ఞ ట ఠ డ ఢ ణ త థ ద ధ న ప ఫ బ భ మ య ర ల వ శ ష స హ ళ.

ఇందకారాదు లచ్చులు, కకారాదులు హల్లులు.

అజ్ఝల్విభాగ మీలాగుననే మీఁద నెఱుంగునది.

౨ ప్రాకృతమునకు వర్ణములు నలువది

అ ఆ ఇ ఈ ఉ ఊ ఏ ఓ అం అః

క ఖ గ ఘ చ ఛ జ ఝ ట ఠ డ ఢ ణ త థ ద ధ న ప ఫ బ భ మ య ర ల వ స హ ళ.

కొందఱ మతంబున హ్రస్వవక్రంబులును బ్రాకృతంబునందుఁ గలవు.

కొందఱ మతంబున వక్రతమంబులుం గలవు.

ఎ ఏ ఒ ఓ లు వక్రములని, ఐ ఔ లు వక్రతమములని ప్రాచీనులు వ్యవహరింతురు.

౩ తెనుఁగునకు వర్ణములు ముప్పదియాఱు

అ ఆ ఇ ఈ ఉ ఊ ఎ ఏ ఐ ఒ ఓ ఔ అం అః

క గ చ చే జ జే ట డ ణ త ద న ప బ మ య ర ల వ స హ ళ.

౪ ఋ ౠ ఌ ౡ ః (విసర్గ) ఖ ఛ ఠ థ ఫ ఘ ఝ ఢ ధ భ ఙ ఞ శ ష లు సంస్కృతసమంబులను గూడి తెలుఁగున వ్యవహరింపఁబడు

ఋతువు, పితౄణము, క్లృప్తము, ౡకారము, దుఃఖము, ఖడ్గము, ఘటము, ఛత్రము, ఝరము, కంఠము, ఢక్క, రథము, ధరణి, ఫణము, భయము, పఙ్క్తి, ఆజ్ఞ, శరము, షండము.

౫ క చ ట త ప లు పరుషంబులని గ జ డ ద బ లు సరళంబులని చెప్పంబడు

౬ ఇతరములగు హల్లులు స్థిరములు

ఖ ఘ ఙ చ ఝ ఞ ఠ ఢ ణ థ ధ న ఫ భ మ య ర ల వ శ ష స హ ళ.

౭ దంత్యతాలవ్యంబు లయిన చ జ లు సవర్ణంబులు

తాలవ్య చకారంబు దంత్య చకారంబునకును, తాలవ్య జకారంబు దంత్య జకారంబునకును గ్రాహకములని తాత్పర్యము.

౮ ఇ ఈ ఎ ఏ లం గూడిన చ జ లు తాలవ్యంబులు

చిలుక, చీమ, చెలి, చేమ, జిల, జీడి, జెట్టి, జేజె.

౯ అ ఆ ఉ ఊ ఒ ఓ ఔ లం గూడిన చ జ లు దంత్యంబులు

చేలి, చేప, చుక్క, చూపు, చొక్కు, చోటు, చౌక, జముఁడు, జాతర, జున్ను, జూలు, జొన్న, జోలి, జౌకు. ఐదంతములయిన చ జ లు సమేతర శబ్దములందు లేవు.

౧౦ సంస్కృతసమంబులం దికారాంతము లయిన శబ్దముల యుపధా చ జ లు బహువచనంబు పరంబగునపుడు దంత్యము లగును

ఇవి దప్ప సంస్కృత సమంబులందు దంత్య చ జ లు లేవని తాత్పర్యము. ఉపధ యనఁగా దుదివర్ణమునకు ముందు వర్ణము. అర్చి- అర్చేలు; రోచి- రోచేలు; వీచి- వీచేలు; రాజి- రాజేలు; వాజి- వాజేలు; మఱియు రాజు శబ్దం బొక్కటి దంత్యయుక్తంబు కానంబడియెడి. ఇతరములయిన చ జల కుదాహరణములు: చంద్రుఁడు, చామరము, చుక్రిక, చూర్ణము, చోరుఁడు, చౌర్యము, జయము, జాతి, జుగుప్స, జూటము ఇత్యాదులు.

## ౧౧ నకారంబు ద్రుతంబు

## ౧౨ ద్రుతాంతము లయిన పదములు ద్రుతప్రకృతికములు

ప్రథమా, కయి, పట్టి, యొక్కేతరములయిన విభక్తులు, ఉత్తమ పురుషైక వచనంబులు, భూత తద్ధర్మాద్యర్థక ప్రథమ పురుషైక వచనంబులు, ఆశీరాద్యర్థంబులయిన యెడుత వర్ణకంబులు, శతృతుమానంతర్య చేదాద్యర్థకంబులు, నేను తాను పదంబులును, వలె ప్రభృతులును, ద్రుత ప్రకృతికంబులు.

నన్నున్, నాచేతన్, నాతోడన్, నాకొఱకున్, నావలనన్, నాకంటెన్, నాకున్, మాలోపలన్, మాయందున్, వత్తున్, వచ్చెదన్, వచ్చెన్, వచ్చున్, వచ్చెడున్, ప్రసన్నులయ్యెడున్, కావుతన్, కొట్టుచున్, కొట్టఁన్, కొట్టఁగన్, కొట్టుడున్, కొట్టినన్, వలెన్, ఎంతయున్, పోలెన్, అయ్యున్ ఇత్యాదు లూహ్యంబులు.

## ౧౩ ద్రుతప్రకృతులు గాని శబ్దంబులు కళ లనంబడు

రాముఁడు, రాములు, హయము, విష్ణువు, గోడ, మేడ, అయ్య, అమ్మ, రామునికయి, జ్ఞానముఁబట్టి, నాయొక్క, వచ్చిరి, వచ్చితిని, వచ్చితిరి, వచ్చితిమి, రాఁడు, రారు, రాదు, రావు, రాము, కొట్టక, తిట్టక, ఎత్తిలి, ఒత్తిలి, ఊరక, మిన్నక, బళి, అక్కట, ఏల ఇత్యాదు లూహించునది.

## ౧౪ హ్రస్వము మీఁది ఖండబిందువునకుఁ బూర్ణబిందువు వైకల్పికముగ నగును

అడఁకువ- అడంకువ; అరఁటి- అరంటి; ఎఱుఁగుట- ఎఱుంగుట; బలఁగము- బలంగము; మగఁటిమి- మగంటిమి.

౧౫ దీర్ఘముమీఁద సాధ్యపూర్ణము లేదు

వాఁడు, వీఁడు, రాఁడు, లేఁడు, కాఁబోలు, కాఁబట్టి, గోఁగులు, రేఁగులు.

౧౬ సంస్కృత సమేతరములయిన తెలుఁగుశబ్దములయందుఁ బరుష సరళంబులకు ముందే బిందువు కానంబడుచున్నది

వంకర, కలఁకువ, మంచే, త్రాఁచే, దంట, దాఁటు, కొంత, కోఁత ఇత్యాదులూహ్యంబులు.

౧౭ యకారంబును వు వూ వొ వో లును దెలుఁగుమాటలకు మొదట లేవు

ఎవఁడు, ఎక్కడ, ఏమి, ఏల, ఉండ, ఊరు, ఒకడు, ఓడ, హరియతఁడు, నిద్రవోయె నిట్టిచోట్ల సంధి వశంబున వచ్చిన యకార వకారంబులుగాని పూర్వసిద్ధంబులు గావు. వోఢృ వోఢవ్య శబ్దములు దప్ప సంస్కృత సమంబులందు సహితము వు వూ వొ వో వర్ణాదులగు శబ్దంబులు లేవని యెఱుంగునది. ఉదకము, ఊర్మిక, ఓదనము.

౧౮ య ర ల వ లు లఘువు లని యలఘువు లని ద్వివిధంబులగు

హరియతఁడు ఇత్యాదులం దాగమ యకారము లఘువు, తక్కిన యకారమలఘువు. విఱుగు, మెఱు గిత్యాదులందు రేఫంబలఘువు. ఇదే శకటరేఫమని చెప్పబడును. శకటరేఫము తత్సమ తద్భవములందు లేదు. పెరుఁగు కరు గిత్యాదులందు రేఫంబు లఘువు. ఏళులు పాళులు త్రాళులని బహుత్వమందు రలడల కాదేశ మయిన ళకార మలఘువు. తల, నెల యిత్యాదులందలి లకారము లఘువు. వర్ణ సమామ్నాయమందలి ళ కారము వర్ణాంతరముగాని యలఘు ళ కారము గాదని యెఱుంగునది. అతఁడు వలికె నిత్యాదులందున్న పాదేశవకారము లఘువు. తక్కిన వకార మలఘువు.

౧౯ సంస్కృత ప్రాకృతతుల్యం బగు భాష తత్సమంబు

| సంస్కృతము | సంస్కృతసమము |
| --- | --- |
| రామః | రాముఁడు |
| విద్యా | విద్య |

| | |
|---|---|
| హరిః | హరి |
| ధేనుః | ధేనువు |
| భూః | భువి |
| పితా | పిత |
| గౌః | గోవు |
| నౌః | నావ |
| దౌః | దివి |
| హృద్ | హృది |
| జగత్ | జగత్తు, జగము |

ఇత్యాదు లూహ్యంబులు.

| సంస్కృతము | ప్రాకృతము | ప్రాకృతసమము |
|---|---|---|
| అగ్నిః | అగ్గీ | అగ్గి |
| ఆటిః | ఆడీ | ఆడి |
| ఆలిః పఙ్క్తౌ | ఓలీ | ఓలి |
| కటుః | కారో | కారము |
| గౌరవమ్ | గారవం | గారవము |
| జటా | జడా | జేడ |
| మిరా | మేరా | మేర |
| యమః | జమో | జేముఁడు |
| రాజ్ఞీః | రాణీ | రాణి |
| శృఙ్గారః | సింగారో | సింగారము |
| శ్రీః | సిరీ | సిరి |

ఇత్యాదు లెఱుంగునది.

## ౨౦ సంస్కృత ప్రాకృతభవంబగు భాష తద్భవంబు

| సంస్కృతము | సంస్కృతభవము |
|---|---|

| | |
|---|---|
| ఆకాశః | ఆకసము |
| కుడ్యమ్ | గోడ |
| చన్ద్రః | చేందురుడు |
| తమఙ్గః | తమగము |
| తామరసమ్ | తామర |
| నారాచః | నారసము |
| నిభః | నెపము, నెవము |
| ముఖమ్ | మొకము, మొగము |
| మృగః | మెకము, మెగము |
| వక్రః | వంకర |
| వేసరః | వేసడము |
| సముద్రః | సముద్రము |
| సూచీ | సూది |
| స్మరః | మరుఁడు |
| హరిణమ్ | ఆరణము |
| హరితాళమ్ | హరిదళము |

ఇత్యాదులు గ్రహించునది.

| సంస్కృతము | ప్రాకృతము | ప్రాకృతభవము |
|---|---|---|
| అఙ్గారః | ఇంగాలో | ఇంగలము |
| అప్సరా | అచ్ఛరా | అచ్చేర |
| ఆశ్చర్యమ్ | అచ్చేరం | అచ్చెరువు |
| పఞ్చాశత్ | పణ్ణాసా | పనస |
| పృథివీ | పుఢవీ | పుడమి |
| ప్రయాణమ్ | పయాణం | పయనము |
| ప్రవాళః | పవాళో | పవడము, పగడము |
| మత్సరః | మచ్ఛరో | మచ్చేరము |

| | | |
|---|---|---|
| యజ్ఞః | జణ్ణో | జేన్నము |
| లక్ష్మీః | లచ్ఛీ | లచ్చి |
| విష్ణుః | విణ్హూ | వెన్నుఁడు |
| వైద్యః | వెజ్జో | వెజ్జే |
| స్తమ్భః | ఖంభో | కంబము |
| స్థూలమ్ | థోరం | తోరము |

ఇత్యాదులు తెలియునది.

## ౨౧ త్రిలింగదేశ వ్యవహారసిద్ధం బగు భాష దేశ్యంబు

ఊరు, పేరు, ముల్లు, ఇల్లు, కోట, పేట, దూడ, మేడ, కోఁత, లేఁత, తావి, మోవి - ఇత్యాదులరయునది.

## ౨౨ లక్షణ విరుద్ధంబగు భాష గ్రామ్యంబు

వస్తాఁడు, తెస్తాఁడు, వచ్చేని, తెచ్చేని, వచ్చేవాఁడు, తెచ్చేవాఁడు, వచ్చేటివాఁడు, తెచ్చేటివాఁడు ఈ భాష ప్రయోగంబున కనర్హంబు.

## ౨౩ ఆర్యవ్యవహారంబుల దృష్టంబు గ్రాహ్యంబు

పెద్దలు వ్యవహరించిన మాట గ్రామ్యంబయిన గ్రహింపఁదగునని తాత్పర్యము. కఱకంఠుఁడు, ప్రాణగొడ్డము, జీవగఱ్ఱ, కపిలకన్నులు, కపిల గడ్డము, కపిలజడలు.

ఇది సంజ్ఞా పరిచ్ఛేదము.



# సంధి పరిచ్ఛేదము.

౧. ఉత్తున కచ్చు పరంబగునపుడు సంధి యగు.

పూర్వపరస్వరంబులకుం బరస్వరం బేకాదేశంబగుట సంధి యనఁబడు.

రాముఁడు + అతఁడు = రాముఁడతఁడు.

సోముఁడు + ఇతఁడు = సోముఁడితఁడు.

మనము + ఉంటిమి = మనముంటిమి.

అతఁడు + ఎక్కడ = అతఁడెక్కడ.

ఇతఁడు + ఒకఁడు = ఇతఁడొకఁడు.

౨. ప్రథమేతర విభక్తి శత్రర్థ చువర్ణంబు లందున్న యుకారమునకు సంధి వైకల్పికముగా నగును.

నన్ను + అడిగె = నన్నడగె, నన్నునడిగె.

నాకొఱకున్ + ఇచ్చె = నాకొఱకిచ్చె, నాకొఱకునిచ్చె.

నాకున్ + ఆదరువు = నాకాదరువు, నాకునాదరువు.

నాయందున్ + ఆశ = నాయందాశ, నాయందునాశ.

ఇందున్ + ఉన్నాఁడు = ఇందున్నాఁడు, ఇందునున్నాఁడు.

ఎందున్ + ఉంటివి = ఎందుంటివి, ఎందునుంటివి.

వచ్చుచున్ + ఉండెను = వచ్చుచుండెను, వచ్చుచునుండెను.

చూచుచున్ + ఏగును = చూచుచేగెను, చూచుచునేగెను.

౩. సంధి లేని చోట స్వరంబుకంటెం బరంబయిన స్వరంబునకు యడాగమంబగు.

ఆగమం బనఁగా వర్ణాధిక్యంబు.

మా + అమ్మ = మాయమ్మ.

మీ + ఇల్లు = మీయిల్లు.

మా + ఊరు = మాయూరు.

౪. అత్తునకు సంధి బహుళముగా నగు.

మేన + అల్లుడు = మేనల్లుడు, మేనయల్లుడు.

పుట్టిన + ఇల్లు = పుట్టినిల్లు, పుట్టినయిల్లు.

చూడక + ఉండెను = చూడకుండెను, చూడకయుండెను.

బహుళ గ్రహణముచేత స్త్రీవాచక తత్సమ సంబోధనాంతంబులకు సంధిలేదు.

అమ్మ + ఇచ్చెను = అమ్మయిచ్చెను.

దూత + అతఁడు = దూతయితఁడు.

చెలువుఁడ + ఇందము = చెలువుఁడయిందము.

సంస్కృతీయంబునకు సంధి యగునని యధర్వణాచార్యులు చెప్పిరిగాని దానికిం బూర్వకావ్యంబులందుఁ బ్రయోగంబు మృగ్యంబు. ఆధునిక కృతులం దొకానొకచోట స్త్రీవాచక తత్సమంబులకు సంధి గానం బడియెడు. గంగనుకాసె, నెలఁతిచ్చెను. వెలయాల్వాదుల సంధిలేమి బాహుళకముచేతనే యని యూహించునది.

౫. ఏమ్యాదుల యిత్తునకు సంధి వైకల్పికముగా నగు.

ఏమి, మఱి, కిషష్టి, అది, అవి, ఇది, ఇవి, ఏది, ఏవి, ఇది యాకృతి గణంబు.

ఏమి + అంటివి = ఏమంటివి, ఏమియంటివి.

మఱి + ఏమి = మఱేమి, మఱియేమి.

హరికిన్ + ఇచ్చె = హరికిచ్చె, హరికినిచ్చె.

౬. క్రియాపదంబులం దిత్తునకు సంధి వైకల్పికముగా నగు.

వచ్చిరి + అప్పుడు = వచ్చిరప్పుడు, వచ్చిరియప్పుడు.

వచ్చితిమి + ఇప్పుడు = వచ్చితిమిప్పుడు, వచ్చితిమియిప్పుడు.

౭. మధ్యమపురుష క్రియలయం దిత్తునకు సంధి యగును.

ఏలితివి + అపుడు = ఏలితివపుడు.

ఏలితి + ఇపుడు = ఏలితిపుడు.

ఏలితిరి + ఇపుడు = ఏలితిరిపుడు.

౮. క్త్వార్థంబైన యిత్తునకు సంధి లేదు.

వచ్చి + ఇచ్చెను = వచ్చియిచ్చెను.

౯. ఇఁకాదులకుఁ దప్ప ద్రుతప్రకృతికములకు సంధి లేదు.

ప్రథమేతర విభక్తివిధి నిరవకాశంబుగావున దీనిని బాధించెడిని.

వచ్చున్ + ఇపుడు = వచ్చునిపుడు

చూడన్ + అయితి = చూడనయితి.

ఉండెడిన్ + అతఁడు = ఉండెడినతఁడు.

ఇఁక, ఇఁగ, ఎట్టకేలకు, ఎట్టకేని, ఈయవి - యికాదులని యెఱుంగునది. వీనికి సంధి వైకల్పికము.

౧౦. అచ్చున కామ్రేడితంబు పరంబగునపుడు సంధి తఱుచుగ నగు.

ద్విరుక్తము యొక్క పరరూప మామ్రేడిత మనంబడు. తఱచుగ ననుటచేత నొకానొకచోట వైకల్పిక సంధియుం గలదని తాత్పర్యము.

ఔర + ఔర = ఔరౌర.

ఆహా + ఆహా = అహాహా.

ఎట్టూ + ఎట్టూ = ఎట్టెట్టూ.

ఓహో + ఓహో = ఓహోహో.

ఏమి + ఏమి = ఏమేమి, ఏమియేమి.

ఎగి యేగి యనుచోఁ గ్త్వార్థంబగుట సంధిలేదు.

౧౧. అంద్వవగాగమంబులం దప్ప నపదాదిస్వరంబు పరంబగునపు డచ్చునకు సంధి యగు.

మూర + ఎఁడు = మూరెఁడు

వీసె + ఎఁడు = వీసెఁడు

అర్థ + ఇంచు = అర్థించు

నిర్జి + ఇంచు = నిర్జించు

అంద్వవగాగమంబులు పరంబగునపుడు యథాసంభవముగా గ్రహించునది.

రాములందు - రాములయందు, హరియందు, ఎనిమిదవది - ఎనిమిదియవది.

౧౨. కుఱు చిఱు కడు నడు నిడు శబ్దముల ఱ డ ల కచ్చు పరంబగునపుడు ద్విరుక్తటకారం బగు.

కుఱు + ఉసురు = కుట్టుసురు

చిఱు + ఎలుక = చిట్టెలుక

కడు + ఎదురు = కట్టెదురు

నడు + ఇల్లు = నట్టిల్లు

నిడు + ఊరుపు = నిట్టూరుపు

౧౩. ప్రథమమీఁది పరుషములకు గ స డ ద వ లు బహుళముగా నగు.

వాఁడు + కొట్టె = వాఁడు గొట్టె, వాఁడు కొట్టె

అపుడు + చనియె = అపుడు సనియె, అపుడు చనియె

నీవు + టక్కరివి = నీవు డక్కరివి, నీవు టక్కరివి

మీరు + తలఁడు = మీరు దలఁడు, మీరు తలఁడు

వారు + పోరు = వారు వోరు, వారు పోరు

అపు డిప్పు డెప్పు డను శబ్దములు నిత్యైక వచనాంతములు. వాగనుశాసనులు యదాతదా యని గ్రహించుట ప్రపంచార్థమని యెఱుఁగునది. ఈ కార్యము కళలగు క్రియా పదముల మీఁద సహితము కానంబడియెడి.

రారు + కదా = రారు గదా, రారు కదా

వత్తురు + పోదురు = వత్తురు వోదురు, వత్తురు పోరుదు

౧౪. తెనుఁగుల మీఁది సాంస్కృతిక పరుషములకు గ స డ ద వ లు రావు.

వాఁడు + కంసారి = వాఁడు కంసారి

వీఁడు + చక్రపాణి = వీఁడు చక్రపాణి

ఆయది + టంకృతి = ఆయది టంకృతి

అది + తథ్యము = అది తథ్యము

ఇది + పథ్యము = ఇది పథ్యము

౧౫. ద్వంద్వంబునం బదంబు పయి పరుషములకు గ స డ ద వ లగు.

కూర + కాయ = కూరగాయలు

కాలు + చేయి = కాలుసేతులు

టక్కు + టెక్కు = టక్కు డెక్కులు

తల్లి + తండ్రి = తల్లిదండ్రులు

ఊరు + పల్లె = ఊరువల్లెలు

౧౬. ద్రుతప్రకృతికము మీఁది పరుషములకు సరళము లగు.

పూచెను + కలువలు = పూచెను గలువలు

తోఁచెను + చుక్కలు = తోఁచెను జుక్కలు

చేసెను + టక్కులు = చేసెను డక్కులు

నెగడెను + తమములు = నెగడెను దమములు

మొగిడెను + పద్మము = మొగిడెను బద్మము

౧౭. ఆదేశసరళములకు ముందున్న ద్రుతమునకు బిందు సంశ్లేషములు విభాష నగు.

సంశ్లేషం బనగా మీఁది హల్లుతోఁ గూడికొనుట.

పూచెను గలువలు .... పూచెంగలువలు, పూచెఁగలువలు, పూచెన్గలువలు

తోఁచెను జుక్కలు .... తోఁచెంజుక్కలు, తోఁచెఁజుక్కలు, తోఁచెన్జుక్కలు

చేసెను డక్కులు .... చేసెండక్కులు, చేసెఁడక్కులు, చేసెన్డక్కులు

నెగడెను దమములు ... నెగడెందమములు, నెగడెఁదమములు, నెగడెన్దమములు

మొగిడెను బద్మము ... మొగిడెంబద్మము, మొగిడెఁబద్మము, మొగిడెన్బద్మము

పక్షంబున స్వత్వంబగు. స్వత్వంబనఁగా ద్రుతంబునకుఁ బ్రకృతి భావము.

౧౮. ద్రుతంబునకు సరళస్థిరంబులు పరంబు లగునపుడు లోపసంశ్లేషంబులు విభాష నగు.

వచ్చెను + గోవులు = వచ్చె గోవులు, వచ్చెన్గోవులు, వచ్చెను గోవులు

మెఱసెను + ఖడ్గము = మెఱసెఖడ్గము, మెఱసెన్ఖడ్గము, మెఱసెను ఖడ్గము

౧౯. వర్గయుక్సరళములు పరములగునపు డొకానొకచో ద్రుతమునకుఁ బూర్ణబిందువును గానంబడియెడి.

వచ్చెను + ధాత్రీపతి = వచ్చెంధాత్రీపతి

పాడెను + గంధర్వుఁడు = పాడెంగంధర్వుఁడు

కన్ + దోయి = కందోయి

౨౦. అవసానంబునందు ద్రుతస్వరంబునకేని ద్రుతంబున కేని లోపంబు బహుళంబుగ౯ా నగు.

వాఁడువచ్చెన్ - వాఁడువచ్చె - వాఁడువచ్చెను.

ఈలోపంబు పద్యాంతములయందు గణానుసారంబుగ వ్యవస్థితంబయియుండు గుర్వవసాయియగు పద్యంబుతుదను స్వత్వంబులేదు. అతిశయముగ బుద్ధిమంతుఁడగు బుధసేవన్.

౨౧. కొన్నియెడల ద్రుతంబుమీఁద నకారంబు గానంబడియెడి.

అదియునున్గాక, దివంబునుంబోలె.

౨౨. అఁట యిఁక చుఁడు శబ్దంబులం దప్ప నుడి తొలి హ్రస్వంబుమీఁద ఖండబిందువును ద్రుతంబునకు లోపంబును లేవు.

ముంగొంగు, క్రొంబసిఁడి, కన్దోయి.

౨౩. తాను నేను పదంబుల ద్రుతంబునకు సంశ్లేషంబు లేదు.

తాను + చేదివె = తాఁ జేదివె, తాను జేదివె

తాను + వినె = తా వినె, తాను వినె

దీర్ఘంబు మీఁదిది గాన దీనికి నెఱసున్న లేదు.

౨౪. సమాసంబునందు ద్రుతంబునకు లోపంబగు.

ఎల్లయర్థములు, ఎల్లకలుషములు. సర్వపర్యాయంబయిన యెల్ల శబ్దంబు ద్రుతాంతంబయిన యవ్యయంబు. దీని కసమాసంబున విశేష్యంబునకు ముందు ప్రయోగంబు లేదు.

౨౫. సమాసంబుల నుదంతంబులగు స్త్రీసమంబులకుం, బుంపులకుం బరుష సరళంబులు పరంబులగునపుడు నుగాగమంబగు.

ఇచటం బరుషంబులు పరంబులగునపుడు ద్రుతంబునకు బిందు సంశ్లేషంబులచే మూఁడురూపంబులు. సరళంబులు పరంబులగునపుడు లోప సంశ్లేష

పూర్ణబిందువులచేత మూఁడు రూపములు. విధాన సామర్థ్యము వలన దీనికి లోపము లేదు. వక్ష్యమాణవిధిచే స్వత్వములేదు.

చిగురు + కయిదువు = చిగురుంగయిదువు, చిగురుఁగయిదువు, చిగురున్గయిదువు

తళుకు + గజ్జెలు = తళుకుంగజ్జెలు, తళుకుగజ్జెలు, తళుకున్గజ్జెలు

సింగపు + కొదమ = సింగపుంగొదమ, సింగపుఁగొదమ, సింగపున్గొదమ

ఉన్నతంపు + గొడుగు = ఉన్నతంపుంగొడుగు, ఉన్నతంపుగొడుగు, ఉన్నతంపున్గొడుగు

నలుఁగడాదులు నీ యాగమంబు లేదండ్రు. ఈ యాగమంబొకా నొకచోట స్థిరంబు పరంబగుచోఁ గానంబడియెడి. గఱునపున్మురువు.

౨౬. సమాసంబులందు ద్రుతంబునకు స్వత్వంబు లేదు.

౨౭. తలఁబ్రాలు మొదలగు సమాసంబుల ద్రుతమునకు లోపము లేదు.

తలఁబ్రాలు, ఒడిఁబ్రాలు, సేసఁబ్రాలు, ఊరఁబంది, ఊరఁబిచ్చిక, తోడఁబుట్టువు, తోఁబుట్టువు, ఒల్లన్‌బాటు, ఒడఁబాటు ఇత్యాదులు.

౨౮. కర్మధారయంబులం దుత్తున కచ్చు పరంబగునపుడు టుగాగమం బగు.

కఱకు + అమ్ము = కఱకుటమ్ము

నిగ్గు + అద్దము = నిగ్గుటద్దము

సరసపు + అలుక = సరసపుటలుక

౨౯. కర్మధారయంబునందుఁ బేర్వాదిశబ్దముల కచ్చు పరంబగునపుడు టుగాగమంబు విభాషనగు.

పేరు + ఉరము = పేరటురము, పేరురము

చిగురు + ఆకు = చిగురుటాకు, చిగురాకు

పొదరు + ఇల్లు = పొదరుటిల్లు, పొదరిల్లు

౩౦. పేదాది శబ్దంబుల కాలుశబ్దము పరంబగునపుడు కర్మధారయంబునందు రుగాగమం బగు.

పేద + ఆలు = పేదరాలు

బీద + ఆలు = బీదరాలు

పేద, బీద, ముద్ద, బాలింత, కొమ్మ, జవ, అయిదవ, మనుమ, గొడ్డు ఇట్టివి పేదాదులు. ఇందు జవ్వని శబ్దంబునకు జవాదేశంబని యెఱుంగునది. "ఏకాంతమునందు నున్న జవరాండ్ర" నని ప్రయోగము.

౩౧. కర్మధారయంబునం దత్సమంబుల కాలుశబ్దము పరంబగునపు డత్వంబున కుత్వంబును రుగాగమంబు నగు.

ధీర + ఆలు = ధీరురాలు

గుణవంత + ఆలు = గుణవంతురాలు

ఇచట వృత్తియం దాలుశబ్దము స్త్రీమాత్రపరము.

౩౨. కర్మధారయంబులందు మువర్ణకంబునకుం బుంపు లగు.

సరసము + మాట = సరసపుమాట, సరసంపుమాట

విరసము + వచనము = విరసపువచనము, విరసంపువచనము

౩౩. ఉదంతమగు తద్ధర్మార్థవిశేషణమున కచ్చు పరమగు నపుడు నుగాగమం బగు.

చేయు + అతఁడు = చేయునతఁడు

చేసెడు + అతఁడు = చేసెడునతఁడు

౩౪. షష్ఠీసమాసమునం దుకార ఋకారముల కచ్చు పరమగునపుడు నుగాగమం బగు.

విధాతృయొక్క + ఆనతి = విధాతృనానతి

రాజుయొక్క + ఆజ్ఞ = రాజునాజ్ఞ

౩౫. ఉదంత స్త్రీసమంబులకును, బుంపులగు నదంతగుణవాచకంబులకును దనంబు పరంబగునపుడు నుగాగమంబగు.

సొగసు + తనము = సొగసుందనము, సొగసుఁదనము, సొగసున్దనము

సరసపు + తనము = సరసపుందనము, సరసపుఁదనము, సరసపున్దనము

తెల్ల + తనము = తెల్లందనము, తెల్లఁదనము, తెల్లన్దనము

౩౬. సమాసంబునఁ బ్రాఁతాదుల తొలియచ్చుమీఁది వర్ణంబుల కెల్ల లోపంబు బహుళంబుగా నగు.

ప్రాఁత + ఇల్లు = ప్రాయిల్లు, ప్రాఁతయిల్లు

లేఁత + దూడ = లేదూడ, లేఁతదూడ

పూవు + రెమ్మ = పూరెమ్మ, పూవురెమ్మ

౩౭. లుప్త శేషంబుకుం బరుషములు పరములగునపుడు నుగాగమం బగు.

ప్రాఁత + కెంపు = ప్రాఁగెంపు

లేఁత + కొమ్మ = లేఁగొమ్మ

పూపు + తోఁట = పూఁదోఁట

మీఁదు + కడ = మీఁగడ

కెంపు + తామర = కెందామర

చెన్ను + తోవ = చెందోవ

చెన్ను శబ్దము వృత్తిని శోణార్థకంబు. బహుళ గ్రహణముచే మీఁదు ప్రభృతులం నిట లోపంబు నిత్యంబు. వ్యవస్థిత విభాషచే నీ ద్రుతంబునకు సంశ్లేషంబు లేదు.

౩౮. క్రొత్తశబ్దమున కాద్యక్షరశేషంబునకుం గొన్ని యెడల నుగాగమంబునుం గొన్ని యెడల మీఁదిహల్లునకు ద్విత్వంబు నగు.

క్రొత్త + చాయ = క్రొంజాయ

క్రొత్త + చెమట = క్రొంజెమట

క్రొత్త + పసిఁడి = క్రొంబసిఁడి

క్రొత్త + కారు = క్రొక్కారు

క్రొత్త + తావి = క్రొత్తావి

పరుషేతరంబులు పరంబులగునపుడు నుగాగము ప్రాప్తి లేమిఁ జేసి వానికి ద్విత్వంబగు.

క్రొత్త + గండి = క్రొగ్గండి

క్రొత్త + నన = క్రొన్నన

క్రొత్త + మావి = క్రొమ్మావి

కెంధూళి కెంజడలని ప్రయోగంబులు కానంబడియెడి. బహుళ గ్రహణముచేతఁ గ్రొత్తకుండ లిత్యాదుల లోపంబులేదు. క్రీఁగడుపు, క్రీఁగాలు, క్రీఁదొడ ఇత్యాదులం గ్రిందుశబ్దమునకు లుప్తశేషంబునకు దీర్ఘంబు బహుళ గ్రహణముచేత నని యెఱుఁగునది.

## ౩౯. అన్యంబులకు సహిత మిక్కార్యంబులు కొండొకచోఁ గానంబడియెడి.

ఒకానొక శబ్దంబున నొకానొక శబ్దము పరంబగునపుడు తొంటియటు లోపనుగాగమంబును, గొండొక శబ్దమున కొకానొక శబ్దము పరంబగునపుడు లోపద్విత్వంబులును ప్రయోగంబులందుఁ జూపట్టెడునని తాత్పర్యము.

పది + తొమ్మిది = పందొమ్మిది

తొమ్మిది + పది = తొంబది

వంక + చెఱఁగు = వంజెఱఁగు

సగము + కోరు = సంగోరు

నిండు + వెఱ = నివ్వెఱ

నిండు + వెఱఁగు = నివ్వెఱఁగు

నెఱ + తఱి = నెత్తఱి

నెఱ + నడుము = నెన్నడుము

నెఱ + మది = నెమ్మది

నెఱ + వడి = నెవ్వడి

ఇత్యాదులు ప్రయోగంబుల వలనం దెలియునది.

౪౦. ఆమ్రేడితంబు పరంబగునపుడు కడాదులం దొలి యచ్చు మీఁది వర్ణంబుకెల్ల నదంతం బగు ద్విరుక్త టకారం బగు.

ఈ సూత్రమునకు భృశార్థంబునందు ద్విరుక్తంబు విషయంబని యెఱుంగునది.

కడ + కడ = కట్టకడ

ఎదురు + ఎదురు = ఎట్టఎదురు

కడ, ఎదురు, కొన, చివర, తుద, తెన్ను, తెరువు, నడుమ, పగలు, పిడుగు, బయలు, మొదలు ఇత్యాదులు కడాదులు.

౪౧. ఆమ్రేడితంబు పరంబగునపుడు విభక్తిలోపంబు బహుళంబుగా నగు.

అప్పటికిన్ + అప్పటికిన్ = అప్పటప్పటికిన్, అప్పటికప్పటికిన్

అక్కడన్ + అక్కడన్ = అక్కడక్కడన్, అక్కడనక్కడన్

ఇంటన్ + ఇంటన్ = ఇంటింటన్, ఇంటనింటన్

ఊరన్ + ఊరన్ = ఊరూరన్, ఊరనూరన్

ఇంచుక నాఁ డిత్యాదులందు బహుళగ్రహణముచేత నంతిమాక్షర లోపంబు నగు.

ఇంచుక + ఇంచుక = ఇంచించుక. ఇంచుకించుక

నాఁడు + నాఁడు = నానాఁడు, నాఁడునాఁడు

౪౨. అందదుకు ప్రభృతులు యథా ప్రయోగంబుగ గ్రాహ్యంబులు.

అందదుకు, ఇట్టింకులు, ఇల్లిగ్గులు, చెల్లచెదరు, చెల్లాచెదరు, తుత్తుమురు, తుత్తునియలు, మిఱుమిట్లు ఇత్యాదులెఱుంగునది.

౪౩. చేత తోడ వలనల కిత్వంబు సమాసంబులం దగు.

నీచేతన్ + ప్రోపు = నీచేతిప్రోపు

నాతోడన్ + చెలిమి = నాతోడిచెలిమి

నీవలనన్ + భయము = నీవలనిభయము

౪౪. అంద్వాదుల కలిగాగమంబు సమాసంబునం దగు.

నాయందున్ + కరుణ = నాయందలి కరుణ

ఇందున్ + జనులు = ఇందలిజనులు

ఎందున్ + వారు = ఎందలివారు

ఎందు శబ్దమున కలిగాగమము కొందఱు లేదండ్రు.

౪౫. అది యవి శబ్దంబుల యత్తునకు వృత్తిని లోపంబు బహుళంబుగ నగు.

నా + అది = నాది, నాయది

నా + అవి = నావి, నాయవి

ఉదంతములగు తద్ధర్మ విశేషణంబులకు మీఁద లోపంబు లేదనియు నిదంతంబులగు తద్ధర్మ విశేషంబులకు మీఁద నిత్యంబనియు బహుళగ్రహణముచే నెఱుంగునది.

వచ్చునది - వచ్చునని, వచ్చెడిది - వచ్చెడివి.

౪౬. పడ్వాదులు పరంబులగునపుడు మువర్ణకంబునకు లోపపూర్ణబిందువులు విభాష నగు.

భయము + పడె = భయపడె, భయంపడె, భయముపడెను

సూత్రము + పట్టె = సూత్రపట్టె, సూత్రంపట్టె, సూత్రముపట్టె

ఈ కార్యము కర్తృవాచి మువర్ణకమునకుఁ గలగదు. గజము పడియె, అశ్వము పడియె.

౪౭. మధ్యమపురుష మువర్ణకంబునకు హలవసానంబులు పరంబులగునపుడు లోపము విభాష నగు.

చూడుము + నన్ను = చూడునన్ను, చూడుము నన్ను

ఇటు + చూడుము = ఇటుచూడు, ఇటు చూడుము

చూడుమనియె, వినుమనియె. ఇచ్చట నచ్చు పరంబయినది. కాబట్టి లోపములేదు.

౪౮. వ్యతిరేక మధ్యమ మువర్ణకంబున కెల్లయెడల లోపంబు విభాష నగు.

నమ్మకము + ఇట = నమ్మకిట, నమ్మకు మిట

౪౯. ఆమ్రేడితంబు పరంబగునపుడు మధ్యమ ముడుజ్జు లోపంబు విభాష నగు.

ఉండుము + ఉండుము = ఉండుండుము,ఉండుముండుము

కొట్టుఁడు + కొట్టుఁడు = కొట్టు కొట్టుఁడు, కొట్టుఁడు కొట్టుఁడు

౫౦. విసర్గంబున కనుకరణంబున లోపం బగు.

వర్ధతాం శ్రీః + అనియె = వర్ధయాం శ్రీ యనియె.

౫౧. అనుకృతిని నమశ్శబ్దము తుది యత్తున కోత్వము విభాష నగు.

తుభ్యంనమః + అనె = తుభ్యంనమో అనె, తుభ్యం నమ యనె

ఈ కార్యము లాఁతిచో సహితము గనంబడియెడి. గతాను గతికో లోకో యటంచున్.

౫౨. అనుకరణంబునం దుదిహల్లునకు ద్విర్వచనం బగు.

కింతత్ + అనియె = కింతత్తనియె

కస్త్వమ్ + అనియె = కస్త్వమ్మనియె

౫౩. అనుకరణంబునం దహమాదుల మకారంబునకు ద్విరుక్తి విభాషనగు.

దాసోహమ్ + అనె = దాసోహమ్మనె, దాసోహమనె

తత్కర్తవ్యమ్ + అనె = తత్కర్తవ్యమ్మనె, తత్కర్తవ్యమనె

౨౪. ఉదంతనామంబున కనుకరణంబునందు వుగాగమం బగు.

ఇయంధేనుః + అనె = ఇయంధేనువనె

అనుకృతిని నిడుదకుం గుఱుచ యగునని యొకండు పలికెనది నిరాకరంబు. దుర్బలస్య బలం రాజా యన వినవే.

౨౫. వాక్యావసానంబున సంధిలేమి దోషంబు కాదని యార్యు లండ్రు.

సత్యము సర్వశ్రేయము - అదిలేనిచో సర్వధర్మములు వ్యర్థములు. ఇట్లు సంధి విరహంబు కావ్యంబులం బాదాంతమంద చూపట్టెడు.

ఇది సంధి పరిచ్ఛేదము.



# తత్సమ పరిచ్ఛేదము.

---

౧ డు-ము-వు-లు ప్రథమ.

౨ నువర్ణంబు ద్వితీయ.

౩ చేత-తోడ తృతీయ.

౪ కొఱకు-కయి చతుర్థి.

౫ వలన-కంటె-పట్టి పంచమి.

౬ కు-యొక్క-లోపల షష్ఠి.

౭ అందు-న సప్తమి.

౮ తృతీయాదులకు నుగాగమం బగు.

రాముని చేతను, రాముని తోడను, రాముని కొఱకును, రాముని వలనను, రాముని కంటెను, రామునకును, రామునియందును.

౯ కయి పట్టి యొక్క లకు నుగాగమంబు లేదు.

రామునికయి, జ్ఞానముఁబట్టి, రామునియొక్క

౧౦ చేత తోడ లోపల వర్ణకంబుల ప్రథమాక్షరంబులు వైకల్పికంబుగా శేషించు.

ప్రత్యయంబు వర్ణకంబని ప్రాచీనులు వ్యవహరింతురు. రామునిచే, రామునితో, వనములలో

౧౧ డు-ము-వు-న లేకవచనంబులు.

ఏకత్వసంఖ్యను బోధించు ప్రత్యయం బేకవచనంబు. రాముఁడు, సోముఁడు, వనము, ధనము, ధేనువు, భానువు.

౧౨ లు వర్ణంబు బహువచనంబు.

బహుత్వ సంఖ్యను బోధించు ప్రత్యయంబు బహువచనంబు. రాములు, సోములు, వనములు, ధనములు, ధేనువులు, భానువులు.

౧౩ తక్కినవి యుభయంబులు.

మిగిలిన ప్రత్యయము లేకత్వ బహుత్వములకు బోధకములని యర్థము.

వనమును, వనములను, వనముచేతను, వనములచేతను, వనముతోడను, వనములతోడను.

౧౪ ఓ యామంత్రణంబునం దగు.

ఓయనుశబ్దము సంబోధనంబునం దగునని యర్థము.

ఇది సంబోధ్యవాచకంబునకు ముందే ప్రయోగింపబడును.

ఓశబ్దంబు తొఱంగియు సంబోధ్యవాచకంబు ప్రయోగింపవచ్చును.

ఓ రాముఁడ, ఓ రాములార, రాముఁడ, రాములార.

౧౫ ఓ శబ్దంబునకుం బురుష నీచ స్త్రీ పురుషామంత్రణంబులందు యి-సి-రి వర్ణంబులు విభాష నంతాగమంబు లగు.

ఓయి రాముఁడ - ఓ రాముఁడ, ఓసి దుష్టురాల - ఓ దుష్టురాల, ఓరి దుష్టుఁడ - ఓ దుష్టుఁడ.

౧౬ ఓరి యోసి మైత్రియందుం గలవు.

ఓరి చిన్నికృష్ణ, ఓసి ముద్దుబాల.

ఓయి మొదలయిన వానికి స్వతంత్ర ప్రయోగముం గలదు.

సంతతియె యోయి, ఓసిపోవే, ఓరోరి.

ఇంకెందుఁబోవచ్చు - వీనికి దీర్ఘంబుం గలదు.

ఓయీ విప్రకులావతంస, ఓరి దుష్టనిశాటులార, ఓసీ ననుఁ జెనకరాకు.

౧౭ స్త్రీ తిర్యగ్జడ భిన్నంబులును వాని విశేషణంబులును మహత్తులనంబడు.

తిర్యక్కులనఁగాఁ బశుపక్ష్యాదులు. జడము లనఁగా నచేతనములు.

౧౮ క్లీబంబులు, మిత్రాదులు, మహద్వాచకంబులు విభాషం బుంలింగ తుల్యంబు లగు.

మిత్రశరణ ప్రధాన పాత్రాదులు మిత్రాదులు.

౧౯ జిత్తు బిందుపూర్వం బగు.

ఙకార మిత్తుగాఁ గలదానికి ముందు బిందువు వచ్చునని యర్థము.

కార్యార్థము ప్రత్యయాదులందు నిబద్ధమయి ప్రయోగించునపుడు మానంబడు వర్ణ మిత్తు నాఁబడు.

ఉదాహరణము మీఁద స్పష్టంబగు.

౨౦ డుజ్వర్ణకంబునకుం బ్రకృతియయినది డుమంతం బనంబడు.

స్పష్టము.

౨౧ పుంలింగంబయి, మహద్వాచకం బయిన నామంబు తుది యత్వంబున కుత్వం బగు.

నామంబనఁగాఁ బ్రాతిపదికము.

డిద్ధ, రామ, భార్గవ, రాజపురుష - ఇట్టివి ప్రాతిపదికములు.

డిద్ధు, రాము, భార్గవు, రాజపురుషు.

౨౨ పుంలింగ మగు మహద్వాచకమునకు డుజ్ఞగు.

ఇచ్చట డుజ్ఞను దానియందు జకార మిత్తుగావున జిత్తు బిందుపూర్వంబగునను సూత్రముచేత డువర్ణమునకు ముందు సున్న వచ్చును. బిమ్మట జకారము లోపించును.

డిద్ధుఁడు - డిద్ధుండు, రాముఁడు - రాముండు, భార్గవుఁడు - భార్గవుండు.

౨౩ డుమంతంబునకు ద్వితీయాద్యేకవచనంబు పరంబగునపుడు నిగాగమంబు సర్వత్ర విభాష నగు.

రామునిని - రాముని, రామునిచేతను - రాముచేతను, రామునికిని - రామునకును.

సర్వత్ర యనుట నగాగమ బాధనార్థము.

౨౪ అనుదంత మగు తెనుఁగు డుమంతమునకు నిగాగమము నిత్యముగా నగును.

మగనిని - మగనిచేతను - మగనికిని అనుదంతంబను పర్యుదానముచేత

తమ్మునిని - తమ్ముని, తమ్మునిచేతను - తమ్ముచేతను, అల్లునిని - అల్లుని, అల్లునిచేతను - అల్లుచేతను, బల్లిదునిని - బల్లిదుని, బల్లిదుని చేతను - బల్లిదుచేతను ఇత్యాదులందు నిగాగమంబు పాక్షికంబని యెఱుఁగునది.

౨౫ డుమంతంబుమీఁది నువర్ణకంబు నుత్వంబున కిత్వం బగు.

నువర్ణంబు ద్వితీయ యను సూత్రముచేత రామును, అని ప్రాప్తింపఁగా

ని సూత్రముచేత నువర్ణకోత్వమున కిత్వంబు సిద్ధించె.

రాముని, భార్గవుని.

౨౬ ఇకారంబుమీఁది కు ను వు క్రియావిభక్తుల యత్వంబున కిత్వం బగు.

హరిని - హరికిని, శ్రీని - శ్రీకిని, వారిని - వారికిని.

౨౭ ఈ ధాతు యుష్మదర్థంబుల మీఁది వాని యుత్వంబున కిత్వంబు రాదు.

ఈరు, ఈవు, ఈను, ఈము, ఈకు, నీకు, మీకు.

౨౮ కువర్ణకంబు పరంబగునపు డుకార ఋకారంబులకు నగాగమం బగు.

రామునకును, విష్ణువునకును, సవితృనకును, విధాతృనకును.

౨౯ ఉకార ఋకారంబుల కందు వర్ణకము పరంబగునపుడు నుగాగమం బగు.

రామునందును, విష్ణునందును, విధాతృనందును.

౩౦ ఆగమ ము వు వర్ణంబుల కందువర్ణకము పరంబగునపుడు నుగాగమంబు విభాషనగు.

వనమునందును - వనమందును, ధేనువునందును - ధేనువందును.

౩౧ బహుత్వంబున ద్వితీయాది విభక్తులకు లడాగమంబగు.

రాములను - రాములచేతను, విధాతృలను - విధాతృలచేతను.

౩౨ సంబోధనంబునం దేకార్థంబయిన పదంబు తుదియుకారంబున కకారంబగు.

ఓ రాముఁడ, ఓ వృక్షమ, ఓ శంభువ, ఓ కొడుక.

౩౩ సంబోధనంబునందుఁ బదంబు తుది యకారేకారంబులకు దీర్ఘంబు విభాషనగు.

ఓ రాముఁడా - ఓ రాముఁడ, ఓ చెలియా - ఓ చెలియ, ఓ హరీ - ఓ హరి, ఓ తండ్రీ - ఓ తండ్రి.

౩౪ కృతోత్కంబగు సంస్కృతనామంబు సంబుద్ధి డుజ్ఞునకు లోపంబు విభాషనగు.

ఓ రామ, ఓ కృష్ణ.

పూర్వసూత్రముచేత దీర్ఘంబు.

ఓ రామా, ఓ కృష్ణా

సంస్కృత నామంబగుటఁ జేసి ఓ తమ్ముఁడ, ఓ బల్లిదుఁడ ఇత్యాదులందు లోపంబులేదు.

౩౫ ఉదంత సంస్కృతనామంబు మీఁది సంబుద్ధి డుజ్ఞునకు నూకారంబు ప్లుతం బాదేశంబు విభాషనగు.

ఓ విష్ణూ, ఓ శంభూ.

పక్షంబునందు, విష్ణుఁడ, శంభుఁడ ఇత్యాది.

౩౬ సంబోధనంబునందు బహువచనంబున కారగాగమంబగు.

ఓ రాములార, ఓ కృష్ణులార.

దీనికిం బాక్షికంబుగ దీర్ఘంబగు - ఓ రాములారా, ఓ కృష్ణులారా.

౩౭ మధ్యమపురుష యోగంబునం దార గాగమంబు విభాష నగు.

వినుఁడు బాలకులు - వినుఁడు బాలకులార. వచ్చితిరి కాంతలు - వచ్చితిరి కాంతలార.

అన్నలార మిమ్మునడిగెద నొకమాట.

ఇచ్చుట మధ్యమ పురుష యోగంబు లేమింజేసి యారగామంబు నిత్యంబు.

౩౮ అదంతం బయి దీర్ఘ పూర్వలోపధం బయిన మహత్తు మీఁది విభక్తి లకారంబునకు రేఫంబగు.

బాలురు - బాలురను - బాలురచేతను, నృపాలురు - నృపాలురను - నృపాలురచేతను.

దయాళు శబ్దంబున కిట్లు రేఫంబు గానంబడియెడి.

దయాళురు - దయాళురను - దయాళురచేతను.

౩౯ అమహన్నపుంసకముల కదంతములకు ముువర్ణకంబగు.

వృక్షము, ఋక్షము; దైవము, కళత్రము, ఆపత్యము; క్లీబంబులు మిత్రాదు లనుసూత్రంబునఁ బాక్షికంబుగం బుంలింగత్వం బతిదేశించుటం జేసి మిత్రాదిశబ్దంబులకు ద్వైరూపం బెఱుంగునది.

మిత్త్రుఁడు - మిత్రము; శరణుఁడు - శరణము;

౪౦ వానికి ముువర్ణ కేతరం బయిన విభక్తి పరంబగునపుడు ముగాగమం బగు.

వృక్షములు - వృక్షమును, ఋక్షములు - ఋక్షమును.

౪౧ ముువర్ణకంబునకు విధించు కార్యము ముగాగమంబునకు నగు.

ముువర్ణంబునకు విధించు లోపాదేశాది కార్యములు ముగాగమమునకు సహితము వచ్చునని యర్థము.

౪౨ ముువర్ణకంబునకు మాముడియేనిం బూర్ణ బిందుపూర్వక బువర్ణంబేని విభాష నగు.

వృక్షము - వృక్షంబు; ఋక్షమ్ము - ఋక్షంబు.

పూర్వ సూత్రముచేత ముగాగమమున కీకార్యంబగు.

వృక్షమ్ములు - వృక్షంబులు; ఋక్షమ్ములు - ఋక్షంబులు.

౪౩ లు ల న లు పరంబులగునపు డొకానొకచో ముగాగమంబునకు లోపంబును,

దత్పూర్వస్వరంబునకు దీర్ఘంబును విభాష నగు.

వజ్రాలు - వజ్రాలను - వజ్రాన, పగడాలు - పగడాలను - పగడాన.

ఒకానొకచోట ననుటచే నీ కార్యంబునకుం బ్రయోగ వైరళ్యంబు సూచింపంబడియె.

౪౪ ఇ గ్లౌరాయుగంతంబుల ప్రథమైక వచనంబునకు లోపంబగు.

ఇకారాంతమునకు, గ్లౌరై శబ్దంబులకు, మఱి యుగాగ మాంతంబులకుం బ్రథమైక వచన లోపంబగు. హరి, గిరి, శ్రీ, ధీ.

౪౫ ఇత్తునకు బహువచనంబు పరంబగునపు డుత్వం బగు.

హరులు, గిరులు, కవులు, కపులు, యామినులు, భామినులు.

తపకరణంబుచే దీర్ఘంబున కుత్వంబు లేదు.

శ్రీలు, స్త్రీలు, లకోరీలు.

౪౬ వికృతియం దికారాంతముల యుపోత్తమేత్వంబునకు బహువచనము పరంబగునపు డుత్వం బగు.

ఇచ్చుటవికృతిశబ్దముచే సంస్కృతసమేతరంబు గ్రహింపవలయు.

కలికి - కలుకులు, ములికి - ములుకులు, చెలిమి - చెలుములు, బలిమి - బలుములు.

ఉపోత్తమేత్వంబున కనుటంజేసి జిగి - నిసి ఇత్యాదులం దుత్వంబులేదు.

జిగులు - నిసులు.

౪౭ ర ల డోపధ నవార్ధాదుల యుపోత్తమేత్వంబున కుత్వంబు కలుగదు.

పందిరి - పందిరులు; పిడికిలి - పిడికిళులు; రాపిడి - రాపిడులు; తొమ్మిది - తొమ్మిదులు.

౪౮ ఉకారాంత గో శబ్దంబుల కంతటు వువర్ణకంబగు.

తరువు - ధేనువు - మధువు - గోవు.

అంతట ననుట స్త్రీలింగ ప్రథమైక వచన లోపబాధనార్థము.

౪౯ వువర్ణకేతరవిభక్తి పరమగుచో నుకారాంతములగు బహుళంబుగా గోశబ్దంబునకు నిత్యంబుగా వుగాగమం బగు.

తరువులు - తరులు - ధేనువులు - ధేనులు - గోవులు.

౫౦ ఉకారాంతం బగు మహత్తునకు వువర్ణకము బహుళముగా నగు.

విష్ణువు - విష్ణుఁడు; శంభువు - శంభుఁడు; వసువు - వసుఁడు.

౫౧ కద్రువ నాగమాత.

కద్రువ - కద్రువలు - కద్రువను - కద్రువలను.

౫౨ ఋకారాంతంబున కత్వంబును స్త్రీ వద్భావంబు నగు.

భ్రాత - జామాత - కర్త - భర్త - హర్త - గంత - హంత.

౫౩ విధాతృ ధాతృ దాతృ సవితృ నేతృ శబ్దంబులకు, మహత్తుల కత్వ స్త్రీ వద్భావంబులు విభాష నగు.

విధాత - విధాతృఁడు, ధాత - ధాతృఁడు, దాత - దాతృడు, సవిత - సవితృఁడు, నేత - నేతృఁడు.

౫౪ నామంబుల తుదిదీర్ఘంబునకు హ్రస్వం బగు.

రమా - రమ, వనితా - వనిత, విద్యా - విద్య, లక్ష్మీ - లక్ష్మి, సేనానీ - సేనాని.

ఇట్లు కృత హ్రస్వములకు హ్రస్వాంతములకుఁ బోలెఁ గార్యంబగు.

లక్ష్ములు - సేనానులు - సిరులు.

౫౫ ఏకాక్షరంబులకు హ్రస్వంబు లేదు.

క్ష్మా - మా - భా - శ్రీ - స్త్రీ - హ్రీ - ధీ - భీ - భ్రూవు.

౫౬ వృద్ధాదుల డుజ్జునకు లోపము విభాష నగు.

వృద్ధు - వృద్ధుఁడు, మూర్ఖు - మూర్ఖుఁడు, నీచు - నీచుఁడు, గృహస్థు - గృహస్థుఁడు, చార్వాకు - చార్వాకుఁడు;

౫౭ స్త్రీలింగంబుల ప్రథమైకవచనంబునకు లోపంబగు.

రమ - క్షమ - వనిత - ఘనత - విద్య - దేవత - మీననేత్ర.

౫౮ చరిత్రాదుల మువర్ణంబునకు లోపంబు బహుళంబుగా నగు.

చరిత్ర - చరిత్రము - చరిత - చరితము - అలక - అభిలాష - అక్షత - ఘోష - తరంగ - భ్రమ - విజృంభణ - వధ - వేగ - స్ఫురణ - హంస ఇత్యాదులు చరిత్రాదులు.

బహుళకమువలన దర్భాదులకుములోపంబు నిత్యంబు.

దర్భ - పనస ఇత్యాదులు.

౫౯ స్వర్గివాచి దేవసురశబ్దంబు లేకత్వ బహుత్వంబులఁ బ్రయోగింపంబడు.

దేవుఁడు - సకలసురులు.

స్వర్గివాచి యనుటచే భూదేవులు - భూసురుఁడను ప్రయోగంబు లబాధిపత్యంబులయ్యె.

౬౦ సురశబ్దంబు నిత్యంబుగా, నసురశబ్దము వైకల్పికముగా స్త్రీతుల్యంబు లగు; సంస్కృతసమాసంబునఁ గావు.

సురలు - అసుర - అసురుఁడు - నిఖిలసురులు - రావణాసురుఁడు - ఎల్లసురలు - ఎల్లయసురులు - ఎల్లయసురులు.

౬౧ దూతాదులకు స్త్రీత్వంబు బహుళంబుగ నగు.

దూత - దూతుఁడు, యోధ - యోధుఁడు, శుంఠ -శుంఠుఁడు.

బహుళ గ్రహణముచే నమహత్త్వంబునందు స్త్రీత్వంబు నిత్యంబు.

సింగంబుదూత యగు జంబుకంబు.

౬౨ పృథ్వీవాచి భూశబ్దంబునకు భువి యగు.

భువి - భువులు - భువిని - భువులను.

౬౩ నౌశబ్దంబునకు నావ యగు.

నావ - నావలు; మహానావ. కొందఱు నావి యనియు నాదేశంబగు నండ్రు.

౬౪ రై గ్లౌ శబ్దంబుల కోత్వంబు విభాష నగు.

ఇగ్లౌసూత్రముచేతం బ్రథమైక వచనమునకు లోపంబు.

రో - రై, గ్లో - గ్లౌ.

౬౫ ఐకారం బీతుల్యంబు.

రైని - రైకి, కైని - కైకి, పైని - పైకి.

౬౬ కంధరాదులు క్లీబతుల్యంబులు బహుళంబుగా నగు.

కంధరము - కంధర.

విధా శబ్దమునకుఁ గ్లీబతుల్యత్వంబు నిత్యంబు - విధము.

కంధరా నాశికా భిక్షా దంష్ట్రా గ్రీవాపాదుకోల్కా ప్రభృతులు కంధరాదులు.

హలంత ప్రకరణము

౬౭ హలంతంబు ప్రథమైక వచనాంతతుల్యం బిందునామంబగు.

రుక్, రాట్, మరుత్, వీరుత్, కర్మ, వర్మ శ్వశబ్దంబు తప్ప నకారాంతంబు లెల్లం బ్రథమైకవచన తుల్యంబులే యగునని యెఱుంగునది.

౬౮ ఉగాగమంబును ద్విత్వంబును దుది హల్లున కగు.

ఉగాగమాంతంబుల కిగ్గౌసూత్రముచేఁ బ్రథమైక వచన లోపంబగు.

రుక్కు, రాట్టు, మరుత్తు, వీరుత్తు.

ఉగాగమంబు లేమింజేసి యిచటనాతంబుల కస్త్రీ లింగంబులకుం బ్రథమైక వచన లోపంబులేదు.

కర్మము, వర్మము, చర్మము, సుధన్వుఁడు, సుత్రాముఁడు.

౬౯ దీర్ఘంబుమీఁది హల్లునకు ద్విత్వంబు బహుళంబుగా నగు.

వాక్కు - వాకు, స్వరాట్టు - స్వరాటు.

౭౦ మతుబాదికంబు ద్వితీయైక వచనాంతతుల్యంబు నామం బగు.

శ్రీమంతమ్, గుణవంతమ్, విద్వాంసమ్, అనడ్వాహమ్, శ్వానమ్, ఉపానహమ్, అప్సరసమ్ ఇత్యాదులు.

౭౧ దాని యంతిమ మకారంబునకు లోపం బగు.

శ్రీమంత, గుణవంత, విద్వాంస, అనడ్వాహ ఇత్యాది.

వీని కజంతములకుం బోలె డుజాదులు యథా యోగ్యంబుగనగు.

అతఁడు శ్రీమంతుఁడు. ఇతఁడు గుణవంతుఁడు, వాని వంశము శ్రీమంతము, వీని వంశము గుణవంతము.

విద్వాంసుఁడు - విద్వాంసము, అనడ్వాహము - శ్వానము - అప్సరస.

వక్ష్యమాణ లక్షణంబుచే స్త్రీత్వంబున మతుబాదులు జ్యతంబులే యిందు గ్రహింపఁబడు.

శ్రీమతి - గుణవతి - విదుషి - శుని.

మహతీవాచ్యం బగునపుడు శ్రీమంతురాలు - గుణవంతురాలు - విద్వాంసురాలనియుఁ బ్రయోగింపఁదగు.

౨౨ ముదాదులకుఁ బ్రథమైకవచనలోపంబు లేదు.

ముదము - ఉపానహము - స్రజము.

౨౩ ఋత్విగాదులు ద్వితీయైక వచనాంతతుల్యంబులు విభాష నగు.

ఋత్విజుఁడు - ఋత్విక్కు, నీవృతము - నీవృత్తు. ఋత్విగాదికం బాకృతిగణంబు.

౨౪ ఒకానొకచో మహత్త్వంబునందు మతుప్తకారంబున కానాదేశంబు విభాష నగు.

హనుమానుఁడు - హనుమంతుఁడు, భగవానుఁడు - భగవంతుఁడు ఇత్యాది.

౨౫ విశ్వకర్మాదులకు స్త్రీత్వం బగు.

స్త్రీ లింగత్వాదిదేశంబుచేత నుత్వడుజ్ఞులు లేవని యెఱుంగునది.

విశ్వకర్మ - కృష్ణవర్త్మ - అశ్వత్థామ - యువ - యజ్వ ఇత్యాదులు.

౨౬ మహద్వాచక మయి పుంలింగం బగు బ్రహ్మశబ్దమునకు స్త్రీత్వంబగు.

బ్రహ్మ - ఈశబ్దము చతుర్ముఖ ఋత్విగ్విప్రులకు వాచకంబు.

తత్వతపోవేదయోగవాచకం బగునేని బ్రహ్మము నాఁబడు.

౭౭ ఆత్మేమనిజంతంబులకు నాంతము లగు మనుజ సంజ్ఞలకు స్త్రీత్వంబు బహుళంబుగా నగు.

౭౮ మహత్త్వంబున స్వార్థపరం బగు రాజశబ్దము రాజు నాఁబడు.

రాజు - ఖగరాజు.

అమహత్త్వంబునందు రాజము - వృక్షరాజము.

ఉపసర్జసత్వంబునందు హతరాజుఁడు - పరశురాముఁడు.

౭౯ జగదింద్రజిత్తుల తకారంబునకు లోపంబు విభాష నగు.

జగము - జగత్తు, ఇంద్రజి - ఇంద్రజిత్తు. ఋత్విగాది యగుటంజేసి యింద్రజితుండనియు వాడంబడు.

౮౦ సాంతంబుల తుది సకారంబునకు లోపంబు బహుళంబుగా నగు.

ఉరము -ఉరస్సు - వక్షము - వక్షస్సు, అర్చి - అర్చిస్సు, ధనువు - ధనుస్సు, ఆయువు - ఆయుస్సు.

బహుళ గ్రహణంబునంచేసి పయః ప్రభృతుల సకారంబునకు లోపంబు.

పయస్సు, వయస్సు, సరస్సు.

౮౧ మహద్వాచకంబులగు సాంతంబుల కంతలోపం బేని, ద్వితీయైక వచనాంత తుల్యత్వంబేనగు.

అంగిరుఁడు - అంగిరసుఁడు, ఉగ్రశ్రవుఁడు - ఉగ్రశ్రవసుఁడు, ప్రచేతుఁడు - ప్రచేతసుఁడు, ఊర్ధ్వరేతుఁడు - ఊర్ధ్వరేతసుఁడు.

౮౨ వేధ పురోధ పురోధసుఁడు.

వేధ శబ్దమునకు నిత్యంబుగాఁ బురోధశ్శబ్దమునకు వైకల్పితముగా సలోపస్త్రీవద్భావంబులు దీనిచే నిపతింపంబడియె.

౮౩ మనఃప్రభృతుల సకారంబునకు ద్విత్వంబు విభాష నగు.

మనసు - మనస్సు, శిరసు - శిరస్సు, సదసు - సదస్సు.

లోపంబయ్యెనేని మనము - శిరము - సదము.

౮౪ ద్యు హృ చ్ఛబ్దంబులకు దివి హృది యగు.

దివి - దివులు, హృది - హృదులు.

౮౫ స్త్రీలింగంబులెల్ల స్వస్వనియతంబులగు స్త్రీప్రత్యయంబులం గూడి యిందుఁ ప్రవర్తిల్లు.

| నామము | స్త్రీ ప్రత్యయము | తత్సమము |
|---|---|---|
| కర్తృ | కర్త్రీ | కర్త్రి |
| జనయితృ | జనయిత్రీ | జనయిత్రి |
| భాగ్యశాలిన్ | భాగ్యశాలినీ | భాగ్యశాలిని |
| బుద్ధిశాలిన్ | బుద్ధిశాలినీ | బుద్ధిశాలిని |
| మతిమత్ | మతిమతీ | మతిమతి |
| గుణవత్ | గుణవతీ | గుణవతి |
| విద్వస్ | విదుషీ | విదుషి |
| వనజముఖి | వనజముఖీ, వనజముఖా | వనజముఖి, వనజముఖ |
| మీననేత్ర | మీననేత్రా | మీననేత్ర |

అంగాదులకుఁ దప్ప సంయోగోపధంబులకు జీప్ప్రత్యయంబు లేమింజేసి మీననేత్రి - పద్మనేత్రి ఇత్యాదు లసాధువులు.

౮౬ మహతీతరంబులగు స్త్రీలింగంబుల విశేషణంబులకుఁ గ్లీబత్వంబు విభాష నగు.

పద్మలత మనోహారి - పద్మలత మనోహారిణి, హృద్యంబగు విద్య - హృద్యయగు విద్య, మొదవులలోఁ గపిల వరిష్ఠంబు - కపిల వరిష్ఠ.

౮౭ భవచ్ఛత్రాదుల కిందుఁ బ్రయోగంబు లేదు.

భవదాదులగు హలంత సర్వనామంబులకును శతృ రేఫాంతాదులకును తెనుఁగు భాషయందు వ్యవహారంబు లేదని యర్థము. సమాసంబులం దొలుతం గదిసి యిందుం బ్రయుక్తంబులగు భవద్గుణంబులు - త్వదాశ్రయము - మత్పుణ్యము - లసద్రూపము - భవిష్యత్కాలము - ధూర్వహము ఇత్యాదు లెఱుంగునది.

ఇది తత్సమ పరిచ్ఛేదము.



# ఆచ్ఛిక పరిచ్ఛేదము.

౧. సంస్కృతసమేతరంబయిన యీభాష యచ్చ యనంబడు.

స్పష్టము

౨. ఆచ్ఛికశబ్దంబులెల్లం దఱుచుగ స్త్రీసమంబులుం గ్లీబసమంబులు నయి యుండు.

స్త్రీ సమత్వాతిదేశంబుచేఁ ప్రథమైక వచన లోపాదికంబును, గ్లీబ సమత్వాది దేశంబుచే మువర్ణకంబు నగునని యెఱుంగునది. అన్న - మిన్న - అద్ద - గద్ద - జాణ - గాణ - ఓడ - గోడ ఇత్యాదులు స్త్రీసమంబులు. బియ్యము - నెయ్యము - అల్లము - మొల్లము - సున్నము - సన్నము ఇత్యాదులు క్లీబసమంబులు.

తఱచుగ ననుటచేఁ బుంలింగతుల్యంబులుం గొండొక కలవని తాత్పర్యము.

కొమరుఁడు - చందురుఁడు - జముఁడు - కందుఁడు ఇత్యాదులు.

౩. బల్లిదాదులు సంస్కృత తుల్యంబులు.

మహత్త్వంబున వీని కుత్వడుఙాదులు నమహత్త్వంబున మువర్ణకాదులును, స్త్రీత్వంబునం దాలు శబ్దముతోడ సమాసంబునుం గలుగునని యెఱుంగునది.

బల్లిదుఁడు, బల్లిదము, బల్లిదురాలు, బల్లిద, అక్కజ, కావల, బెట్టిద, బెడిద, మిసిమింత, మొక్కల ఇత్యాదులు బల్లిదాదులు.

౪. మహత్తు లగు మగాదులకుం గయిరాదులకును డుజ్ఞగు నుత్వంబు గాదు.

మగఁడు - మనుమఁడు - కయిరఁడు - కత్తళఁడు.

మగ - మనుమ - రాయ - పాప - వ్రే - ఱే - ఈ - కా ప్రత్యయాంతంబులు ఇత్యాదులు మగాదులు.

కయిర - కత్తళ - జన్న - నీల ఇత్యాదులు కయిరాదులు.

౫. పగతాదుల బహువచన లకారంబునకు రేఫం బగు.

పగతురు - అల్లురు - నెయ్యురు - బలియురు - మార్తురు.

౬. కొన్ని డుమంతంబుల బహువచన లకారంబునకు రేఫంబును, దానికి ముందు పూర్ణబిందు పూర్వక డకారంబు నగు.

గండ్రండు - మిండ్రండు ఇత్యాదులు.

౭. కాప్రత్యయంబుమీఁది బహువచన లకారంబునకు లఘ్వలఘురేఫంబులును, లఘురేఫంబునకు ముందు బిందుపూర్వక డకారంబు నగు.

విలుకాండ్రు - విలుకాఱు, వేఁటకాండ్రు - వేఁటకాఱు, వేడుకకాండ్రు - వేడుకకాఱు.

౮. ఱే ప్రభృతుల బహువచనమునకు ముందు డుజ్జగు.

ఱేఁడులు - ఱేండ్లు.

౯. కూఁతు శబ్దము ప్రథమైకవచనంబునకు రువర్ణం బగు.

కూఁతురు - కూఁతులు - కూఁతురులు - కూతుళ్ళు.

కూఁతురి నిత్యాది రూపంబులు గ్రామ్యంబులని యెఱుంగునది.

౧౦. చెయువు బహువచన లకారంబున కలఘురేఫంబు విభాష నగు.

చెయువుఱు -చెయువులు - చెయువుఱను - చెయివులను.

౧౧. ఆల్వాదుల బహువచన లకారంబునకు రేఫంబును ముందటి లువర్ణంబునకు బిందుపూర్వక డకారంబు నగు.

ఆండ్రు, ఆండ్రను, ఆలు, చెలియలు, చెల్లెలు, కోడలు, మఱఁదులు ఇవి యాల్వాదులు.

౧౨. బహువచనము పరంబగునపుడు డ ల ట ర ల యుత్వంబునకు లోపంబు బహుళంబుగా నగు.

గుండ్లు - గుండులు, గిండ్లు - గిండులు, కాళ్ళు - కాలులు, మొసళ్ళు - మొసలులు, గొండ్లు - గొంటులు, తుంట్లు - తుంటులు, గోర్లు - గోరులు, సీవిర్లు - సీవిరులు.

బహుళగ్రహణముచే విల్లులు, పిల్లులు, పులు లిత్యాదులందు లోపంబులేదు.

తత్సమంబులం గోటి పిప్పలిశబ్దంబుల కీకార్యంబు చూపట్టెడు.

కోట్లు - కోటులు, పిప్పళ్ళు - పిప్పలులు.

౧౩. బహువచనము పరంబగునపు డసంయుక్తంబులయి యుదంతంబులయిన డ ల ర ల కలఘు లకారంబు బహుళంబుగా నగు.

త్రాళులు - త్రాడులు, గుమ్మళులు - గుమ్మడులు, మొగిళులు - మొగిలులు, పిడికిళులు - పిడికిలులు, ఊళులు - ఊరులు, పందిళులు - పందిరులు.

౧౪. బహువచన శ్లిష్టంబులయి యద్విరుక్తంబులయిన డకార లకారంబుల కలఘు లకారంబు నిత్యంబుగ నగు.

త్రాళ్ళు, గుమ్మళ్ళు, మొగిళ్ళు, మొసళ్ళు, విళ్ళు, సిళ్ళు.

౧౫. సమాసపదంబునందు సంయోగంబు పరంబగునపుడెల్లచో ఖండబిందునకుం బూర్ణం బగు.

అనఁటులు - అనంట్లు, పనఁటులు - పనంట్లు, గోఁటులు - గోంట్లు, తేఁటులు - తేంట్లు, ఏఁడులు - ఏండ్లు, కాఁడులు - కాండ్లు.

ఏండ్లు కాండ్లి త్యాదులందు డాకు ళాదేశంబు కొండఱు వక్కాణించిరి.

తెనుఁగున బిందుపూర్వక స్థిరంబు లేమింజేసి యది గ్రాహ్యంబుగాదు.

౧౬. ఔపవిభక్తికంబుల లివర్ణ స ల లు వర్ణంబులకు బహువచనంబు పరంబగునపుడు పూర్ణబిందుపూర్వక డువర్ణంబు బహుళంబుగా నగు.

కొడవలి - కొడవండులు.

ఉల్లోపంబు -కొడవండ్లు.

పక్షంబునం దలఘులకారంబు - కొడవళ్ళులు - కొడవళు - కొడవలులు.

రోఁకలి ప్రభృతుల కిట్లు రూపంబు లెఱుంగునది.

ఇల్లు - ఇండులు - ఇండ్లు - ఇల్లులు.

ఇట్లు కల్లు, పల్లు, ముల్లు, విల్లు శబ్దంబులకు రూపంబులు తెలియునది.

మధ్య నిమ్నార్థకంబులయిన కల్లు, పల్లు శబ్దంబులు ఱెల్లు ప్రభృతి శబ్దంబులు ననౌపవిభక్తికంబు లగుటంజేసి వానికీ కార్యంబు లేదు.

౧౭. ఒకానొకచో నామంబు సంశ్లిష్ట బహువచనాంత తుల్యంబయి బహువచనంబు నెనయు.

కొడవండ్లులు - కొడవండ్లులను, కొడవళ్ళులు - కొడవళ్లులను ఇట్లు ప్రయోగదృష్టంబులు గ్రహించునది.

౧౮. కలన్వాదుల నువర్ణంబు కుజ్జగు; బహువచనము పరంబగునపుడు నిత్యముగా నగు.

కలఁకు - కలను - కలఁకులు - కలను - కెలను - కొఱకు - కొలను - గవను - నెఱను - మ్రాను - వరను - వలను. ఇవి కలన్వాదులు.

౧౯. అట్లు రేను గోను శబ్దముల నువర్ణంబు గుజ్జగు.

రేఁగు - రేను - రేఁగులు, గోఁగు - గోను - గోఁగులు.

౨౦. బహువచనంబు పరంబగునపుడు చేను పేను మీను శబ్దంబుల నువర్ణంబు లోపించు.

చేను - చేలు, పేను - పేలు, మీను - మీలు.

౨౧. బహువచనంబు పరంబగునపుడు రేయి ప్రభృతుల తుది యక్షరంబు లోపించు.

రేయి - రేలు, ఱాయి - ఱాలు, వేయి - వ్రేలు, వ్రాయి - వ్రాలు ఇత్యాదులు.

ఈ లోపంబు సమాసంబులందుం జూపట్టెడు.

రేరాజు - మగఱాపతకము - వేవెలుఁగు.

౨౨. బహువచనంబు పరంబగునపు డావు ప్రభృతుల తుదియక్షరంబునకు లోపంబు విభాష నగు.

ఆవు - ఆలు - ఆవులు, జాము - జాలు - జాములు, చుట్టము - చుట్టలు - చుట్టములు, మీసము - మీసలు - మీసములు.

౨౩. ఇ య కు మాఱుగా నామాంతంబున కెత్వంబు బహుళంబుగా నగు.

కన్నియ - కెన్నె, జన్నియ - జన్నె, వన్నియ - వన్నె, కొంచియము - కొంచెము, కొండియము - కొండెము.

బహుళ గ్రహణముచే సందియము కాఱియ మొదలగు శబ్దంబులందెత్వములేదు.

ఇయశబ్దంబునం దికారలోపంబు కొందఱు వక్కాణించిరి. అయ్యది ప్రయోగంబులందు మృగ్యంబు.

ముత్తియ శబ్దంబునందు మాత్ర మిత్వలోపంబు గానంబడియెడి.

ముత్తియము - ముత్తెము - ముత్యము.

## సర్వనామ ప్రకరణము

౨౪. అన్ని ప్రభృతులు సర్వనామంబులు.

అన్ని - ఇన్ని - ఎన్ని - కొన్ని - పెక్కు - పలు - ఆ - ఈ - నీ - నా - మన - తా సంఖ్యావాచకములు అన్ని ప్రభృతులు.

వీనికిం బ్రథమాంతరూపంబు లుదాహరించెద. వీనిలో డుమంతంబులకెల్ల న్యాగమంబు పూర్వోక్తంబును స్మరించునది. బహువచన లకారంబునకు రాదేశంబును, బూర్వాగమంబును బ్రథమా బహువచనంబునకుం బోలె నెఱుంగునది.

విశేషాకారంబులు గలిగెనేనిఁ గొండొకచో ద్వితీయవఱకును గొండొకచోఁ దృతీయయం దొక్క రూపంబు వఱకును రూపభేదంబులు వక్కాణించెద. శేషంబూహించునది.

అన్ని మొదలగు శబ్దంబులాఱును, ద్విప్రభృతి సంఖ్యావాచకంబులును మహదర్థంబులు బహువచనాంతంబులగు - అమహదర్థంబు లేకవచనాంతంబులగు.

ఇందు నీ మొదలగు నాలుగు శబ్దంబులు - సర్వార్థంబులం దుల్యరూపంబు లయియుండును.

మ - అనునది మహదర్థమనుటకు, అ - అనునది యమహదర్థమనుటకు, ప్ర - మొదలగునవి ప్రథమాది విభక్తులకును సంకేతములుగా నిందు గ్రహించునది.

సర్వతావదర్థకము:

| | మహదర్థము | అమహదర్థము | | |
|---|---|---|---|---|
| | ఏక వచనము | బహు వచనము | ఏక వచనము | బహు వచనము |
| ప్రథమ | అందఱు<br>అందొఱు | - | అన్ని | - |

ఇయదర్థకము:

| | మహదర్థము | అమహదర్థము | | |
|---|---|---|---|---|
| | ఏక వచనము | బహు వచనము | ఏక వచనము | బహు వచనము |
| ప్రథమ | ఇందఱు | - | ఇన్ని | - |

కియద్యావదర్థకము:

| | మహదర్థము | అమహదర్థము | | |
|---|---|---|---|---|
| | ఏక వచనము | బహు వచనము | ఏక వచనము | బహు వచనము |
| ప్రథమ | ఎందఱు | - | ఎన్ని | - |

కతిపయార్థకము:

| | మహదర్థము | అమహదర్థము | | |
|---|---|---|---|---|
| | ఏక వచనము | బహు వచనము | ఏక వచనము | బహు వచనము |
| ప్రథమ | కొందఱు | - | కొన్ని | - |

బహ్వర్థకము:

| | మహదర్థము | | అమహదర్థము | |
|---|---|---|---|---|
| | ఏక వచనము | బహు వచనము | ఏక వచనము | బహు వచనము |
| ప్రథమ | పెక్కుండ్రు<br>పెక్కురు | - | పెక్కు | పెక్కులు |

ఈ శబ్దంబు లౌపవిభక్తికంబు లగుటంజేసి అన్నిటి - అన్నింటి, ఇన్నిటి - ఇన్నింటి, ఎన్నిటి - ఎన్నింటి, కొన్నిటి - కొన్నింటి, పెక్కిటి -పెక్కింటి యను రూపంబులు ద్వితీయాద్యేక వచనంబులు పరంబు లగునపు డమహత్త్వంబునం దగునని తెలియునది.

బహ్వర్థకము:

| | మహదర్థము | | అమహదర్థము | |
|---|---|---|---|---|
| | ఏక వచనము | బహు వచనము | ఏక వచనము | బహు వచనము |
| ప్రథమ | పలుగురు<br>పలుగుండ్రు | - | అమహత్త్వంబున దీనికి వ్యస్త ప్రయోగంబు లేదు. | |

తదర్థకము:

| | మహదర్థము | | అమహదర్థము | |
|---|---|---|---|---|
| | ఏక వచనము | బహు వచనము | ఏక వచనము | బహు వచనము |
| ప్రథమ | వాఁడు | వారు<br>వారలు<br>వాండ్రు | అది<br>అద్ది<br>ఆయది<br>అయ్యది | అవి<br>అవ్వి<br>ఆయవి<br>అయ్యవి |
| ద్వితీయ | వానిని | వారిని<br>వారలను<br>వాండ్రను | దానిని<br>ఆదానిని<br>అద్దానిని | వానిని |

ఇదమర్థకము:

| | మహదర్థము | | అమహదర్థము | |
|---|---|---|---|---|
| | ఏక | బహు వచనము | ఏక వచనము | బహు |

| | | | | |
|---|---|---|---|---|
| | వచనము | | | వచనము |
| ప్రథమ | వీఁడు | వీరు<br>వీరలు<br>వీఁడ్రు | ఇది<br>ఇవి<br>ఈయది<br>ఇయ్యది | ఇవి<br>ఇవ్వి<br>ఈయవి<br>ఇయ్యవి |
| ద్వితీయ | వీనిని | వీరిని<br>వీరలను<br>వీండ్రను | దీనిని<br>ఈ దానిని<br>ఇద్దానిని | వీనిని |

యత్కిమర్థకము:

| | | | | |
|---|---|---|---|---|
| | మహదర్థము | అమహదర్థము | | |
| | ఏక<br>వచనము | బహు వచనము | ఏక వచనము | బహు<br>వచనము |
| ప్రథమ | ఏఁడు<br>ఏవాఁడు<br>ఎవ్వాఁడు<br>ఎవ్వఁడు<br>ఎవఁడు | ఏరు<br>ఏవారు,<br>ఏవారలు,<br>ఏవాండ్రు<br>ఎవ్వారు,<br>ఎవ్వారలు,<br>అవ్వాండ్రు<br>ఎవ్వరు,<br>ఎవ్వండ్రు<br>ఎవరు, ఎవండ్రు | ఎది<br>ఏది<br>ఎద్ది<br>ఏయది<br>ఎయ్యది | ఎవి<br>ఏవి<br>ఎవ్వి<br>ఏయవి<br>ఎయ్యవి |
| ద్వితీయ | ఏనిని<br>ఏవానిని<br>ఎవ్వారిని<br>ఎవ్వనిని<br>ఎవనిని | ఏరిని<br>ఏవారిని,<br>ఏవారలను,<br>ఏవాండ్రను<br>ఎవ్వారిని,<br>ఎవ్వారలను,<br>ఎవ్వాండ్రను<br>ఎవ్వరిని,<br>ఎవ్వండ్రను<br>ఎవరిని,<br>ఎవండ్రను | దేనిని<br>ఏదానిని<br>ఎదానిని | వేనిని<br>ఏవానిని<br>ఎవ్వానిని |

మహతి వాచ్యంబగునే నేకత్వంబున మత్కిమర్థక శబ్దంబు ఎవ్వరిత - ఎవ్వర్త - ఎవ్వత - ఎవరిత - ఎవర్త - ఎవత - ఎవ్వరితి - ఎవ్వర్తి - ఎవ్వతి - ఎవరితి - ఎవర్తి - ఎవతి - ఎవ్వరితె - ఎవ్వర్తె - ఎవ్వతె - ఎవరితె - ఎవర్తె - ఎవతె - ఎవ్వతుక - ఎవర్తుక - ఎవర్తుక అని యిరువది రెండు రూపంబులు వడయు.

తదాదులు మూఁడు మహద్వాచకంబు లేకత్వంబునం బూజ వివక్షించునపుడు అతఁడు - ఆతఁడు, ఇతఁడు - ఈతఁడు, ఎతఁడు - ఏతఁడు అను రూపంబులు వడయు.

మహతీవాచకంబులు ఆమె - ఆపె - ఆకె, ఈమె -ఏపె - ఏకె, ఏమె - ఏపె - ఏకె అను రూపంబులు వడయు.

యుష్మదర్థకము:

| | ఏక వచనము | బహు వచనము |
|---|---|---|
| ప్రథమ | నీవు<br>ఈవు | మీరు, మీరలు<br>ఈరు, ఈరలు |
| ద్వితీయ | నిన్నును | మిమ్మును |
| తృతీయ | నీ చేతను | మీ చేతను |

అస్మదర్థకము:

| | ఏక వచనము | బహు వచనము |
|---|---|---|
| ప్రథమ | నేను<br>ఏను | మేము, నేము<br>ఏము |
| ద్వితీయ | నన్నును | మమ్మును |
| తృతీయ | నాచేతను | మాచేతను |

ఉభయార్థకము:

| | ఏక వచనము | బహు వచనము (నిత్యబహువచనాంతము) |
|---|---|---|
| ప్రథమ | - | మనము |
| ద్వితీయ | - | మనలను |
| తృతీయ | - | మనచేతను, మనలచేతను |

ఆత్మార్థకము:

| | ఏక వచనము | బహు వచనము |
|---|---|---|

| | | |
|---|---|---|
| ప్రథమ | తన్ను | తన్ను |
| ద్వితీయ | తన్నును | తమ్మును |
| తృతీయ | తనచేతను | తమచేతను |

౨౫. సంఖ్యకుం బూరణార్థంబునం దవగాగమం బగు.

రెండవవాఁడు - రెండవది, మూఁడఁవవాఁడు - మూఁడవది.

౨౬. సర్వనామక్రియాపదంబుల బహువచనంబు మహత్తునకుం బోలె మహతికగు.

వారిద్దఱు రుక్మిణీ సత్యభామలు, వీరు ముప్వురు శ్రీభూనీళలు.

౨౭. అపదాద్యంబయి యసంయుక్తంబయిన గకారంబునకు వకారంబు విభాష నగు.

పలుగురు - పలువులు, ఇరుగురు - ఇరువురు, వేగురు - వేవురు, తొగ - తొవ, పగలు - పవలు.

## ఔప విభక్తిక ప్రకరణము

౨౮. ఇ టి తి వర్ణంబులు వక్ష్యమాణంబు లౌపవిభక్తికంబులు.

విభక్తి నిమిత్తకంబులయి యాదేశాగమాత్మకంబులయిన ఇ - టి - తి అను వర్ణంబు లౌపవిభక్తికంబు లనంబడు.

౨౯. ఇవి ద్వితీయాద్యేక వచనంబులు పరంబులగునపుడు నామంబులకుం గొన్నింటికిం బ్రాయికంబుగ నగు.

కాలు - కాలిని - కాలిచే, నాఁగలి - నాఁగటిని - నాఁగటిచే, నేయి - నేతిని - నేతిచే.

ద్వితీయైక వచనంబు పరంబగు నపు డౌపవిభక్తికంబులు రావని కొందఱు వక్కాణించిరి.

అయ్యది లక్ష్యలక్షణ విరుద్ధంబగుటంజేసి యనాదరణీయంబు.

౩౦. ఊరు మొదలగువాని కిత్వం బగు.

ఊరు - ఊరిని, కాలు - కాలిని, మ్రాను - మ్రానిని, నోరు - నోరిని, చోటు - చోటుని.

౩౧. టి వర్ణంబు గొన్నింటి యంతాక్షరంబున కాదేశంబును, గొన్నింటి కంతాగమంబును, గొన్నింటికిం బర్యాయంబున రెండును బ్రాయికంబుగ నగు.

ఆదేశము: త్రాడు - త్రాటిని, కాఁడు - కాటిని, నోరు - నోటిని, ఏఱు - ఏటిని.

ఆగమము: ఆన్ని - అన్నిటిని, ఎనిమిది - ఎనిమిదిటిని, వేయి - వేయిటిని.

ఉభయము: ఏమి - ఏటిని - ఏమిటిని, పగలు - పగటిని - పగలిటిని, మొదలు - మొదటిని - మొదలిటిని, రెండు - రెంటిని - రెండింటిని, మూఁడు - మూటిని - మూఁడిటిని, నూఱు - నూటిని - నూఱిటిని.

౩౨. హ్రస్వముమీఁది టి వర్ణకంబు ముందు పూర్ణబిందువు బహుళముగానగు.

అన్నింటిని, ఎనిమిదింటిని, పగంటిని, పగలింటిని, రెండింటిని, మూఁడింటిని.

౩౩. పదాద్యం బగు హ్రస్వంబుమీఁది టి వర్ణంబునకు ముందు పూర్ణబిందు వగు.

కన్ను - కంటిని, మిన్ను - మింటిని, ఇల్లు - ఇంటిని, పల్లు - పంటిని.

౩౪. అఱ్ఱు మొదలగు శబ్దముల కంతాగమంబు తి వర్ణంబును రేఫంబున కొక్కటికి లోపంబు నగు.

అఱ్ఱు - అఱితిని. అఱ్ఱు - కఱ్ఱు - కొఱ్ఱు - గొఱ్ఱు - ముఱ్ఱు - వఱ్ఱు ఇవి యఱ్ఱు మొదలయినవి.

౩౫. విభక్తి పరంబగునపుడు గోయి ప్రభృతుల తుదియక్షరంబు తి వర్ణకం బగు.

గోయి - గోతులు - గోతిని - గోతులను. గోయి - చేయి - దాయి - నూయి - నేయి - వాయి - రోయి ఇత్యాదులు.

౩౬. టి తి వర్ణకంబులు పరంబులగునపు డుత్వంబున కిత్వం బగు.

రెంటిని - మూఁడిటికి - నాలుగిటికి - పగలిటికి - మొదలిటికి - పెక్కిటికి.

కొండొకచో నుత్వంబున కిత్వంబు చూపట్టదు - నెత్తుటికి.

౩౭. టి వర్ణంబు పరంబగునపుడు క్రింది మీఁదు ముందు పువర్ణంబుల కత్వం బగు.

క్రింది - క్రిందటిని, మీఁదు - మీఁదటిని, ముందు - ముందటిని, మాపు - మాపటిని, అప్పుడు - అప్పటిని.

౩౮. ఔపవిభక్తికముల తృతీయాసప్తముల కత్వం బాదేశంబు బహుళంబుగా నగు.

గోరను గీరెను, ఊరనున్నాడు, గొడ్డట నరెకెను, ఇంటలేఁడు, వఱుతఁ గలిసె, కఱతఁ దూటె. పక్షంబునందుఁ గోరిచేత నూరియం దిత్యాదులు.

ఇది యాచ్ఛిక పరిచ్ఛేదము.



# కారక పరిచ్ఛేదము.

## ౧. ప్రాతిపదిక సంబోధనోక్తార్థంబులం బ్రథమ యగు.

ప్రాతిపదికార్థమునందు : రాముఁడు - రావణుఁడు.

నియతోపస్థితికము - ప్రాతిపదికార్థము.

సంబోధనమునందు: ఓరాముఁడ - ఓరావణుఁడ.

ఉక్తార్థమందు: రాముఁడు రావణుని సంహరించెను. ఉక్తమనఁగా చెప్పబఁడినది.

ఈ వాక్యమందు నాఖ్యాతము కర్తను జెప్పినది గావునఁ దద్వాచకమగు రామ శబ్దమునకుఁ బ్రథమమయ్యె.

రామునిచే రావణుఁడు సంహరింపఁ బడియె.

ఈ వాక్యమం దాఖ్యాతము కర్మమును జెప్పినది గావునఁ దద్వాచకంబగు రావణ శబ్దమునకుం బ్రథమమయ్యెనని యెఱుంగునది.

## ౨. కర్మంబున ద్వితీయ యగు.

ధాత్వర్థఫలాశ్రయంబు కర్మము నాఁబడు.

దేవదత్తుఁడు వంటకమును వండెను. ఇట వండె ననుమాటకు వంట చేసెనని యర్థము.

వంట ఫలము - చేయుట వ్యాపారము. వంట యనంగ బాకము.

పాకమున కాశ్రయము కావుటంజేసి వంటకము కర్మం బయ్యెనని యెఱుంగునది.

## ౩. చేతవర్ణకంబు కర్త కగు.

ధాత్వర్థ వ్యాపారాశ్రయంబు కర్తనాఁబడు.

దేవదత్తుని చేతి వంటకము వండఁబడియె.

వండఁబడియె ననఁగా వంట చేయఁబడియెనని యర్థము.

చేయుటం కాశ్రయుఁడగుటం జేసి దేవదత్తుండు కర్తయయ్యె.

౪. చేతవర్ణకంబు హేతుకరణంబులకు, గ్రహ్యాదియోగజంబగు పంచమికిని బహుళంబుగా నగు.

ఫలసాధనయోగ్యం బగు పదార్థంబు హేతువు. క్రియాసిద్ధిం బ్రకృష్టోపకారంబు కరణంబు.

హేతువునకు: ధనముచేత సౌఖ్యంబు గలుగు. విద్యచేత యశంబు గలుగు.

పక్షంబున వలన వర్ణకంబగు.

కరణంబునకు: ఖడ్గంబుచేత ఖండించె, కోలచేతఁ గూలనేసె.

పక్షంబున దోడవర్ణకంబగు.

గ్రహ్యాది యోగంబునందు: జరాసంధుఁడు రాజులచేతఁ గప్పంబు గొనియె.

మైత్రుండు చైత్రునిచేత ఋణంబు గొనియె. ఈ యర్థంబులు నీచేత నెఱింగితి.

ఈ వృత్తాంతంబు వానిచేత వింటి.

పక్షంబున వలన వర్ణకంబగు. ఇత్యాదికంబు లెఱుంగునది.

౫. కరణ సహార్థ తుల్యార్థయోగంబులం దృతీయకుం దోడవర్ణకం బగు.

కరణంబునందు: కోలతోడఁగూలనేసె.

సహార్థంబునందు: రాజు సేనలతోడ వచ్చె - సేనాసహితుండయి వచ్చెనని యర్థము.

తుల్యార్థ యోగంబునందు: చైత్రుని తోడ మైత్రుండు తుల్యుండు.

తృతీయకనుటంజేసి చైత్రునకు మైత్రుండు తుల్యుండని తుల్యార్థయోగంబున షష్ఠియునగు.

౬. వచ్యర్థాముఖ్యకర్మంబునకుఁ దోడఁ కువర్ణకంబులు ప్రాయికంబుగా నగు.

మైత్రుండు చైత్రుని తోడ నిట్లనియె - మైత్రుండు చైత్రున కిట్లనియె.

ప్రాయికం బనుటచే నొకానొకచో ద్వితీయయునగు.

౭. ఉపయోగంబునం దాఖ్యాతకుం దోడవర్ణకం బగు.

నియమపూర్వక విద్యాస్వీకారం బుపయోగం బనంబడు.

రామకృష్ణులు సాందీపునితోడ వేదంబుల జదివిరి - సాందీపునివలన నని యర్థము.

౮. సంప్రదానంబునకుం జతుర్థి యగు.

త్యాగోద్దేశంబు సంప్రదానంబు నాఁబడు.

జనకుండు రాముని కొఱకుఁ గన్యనిచ్చెను.

కొన్నియెడల నుద్దేశ్యమాత్రంబున కగు.

పురుషార్థంబు కొఱకు ప్రయత్నింపవలయు.

చతుర్థికి మాఱుగా షష్ఠియె తఱచుగా బ్రయోగంబులం గానంబడియెడి.

జనకుండు రామునకుం గన్యనిచ్చెను. పురుషార్థంబునకు యత్నింపవలయు.

౯. అపాయ భయ జుగుప్సా పరాజయ ప్రమాద గ్రహణ భవన త్రాణ విరామాంతర్థి వారణంబు లెద్దాననగు, దానికి వలన వర్ణంకం బగు.

అపాయము - విశ్లేషము, భయము - వెఱపు, జుగుప్స - ఏవ, పరాజయము - దయ్యుట, ప్రమాదము - పరాకు, గ్రహణము - కొనుట, ఎఱుంగుట - వినుట ఇత్యాది, భవనము - పుట్టుట, త్రాణము - కాచుట, విరామము - విరమించుట, అంతర్థి - మఁఱుగుట, వారణము - వారించుట.

అపాయంబునకు - మైత్రుండు రాజ్యంబువలన భ్రష్టుండయ్యె.

భయంబునకు - చోరునివలన భయపడియె.

జుగుప్సకు - పాపంబు వలన నేవగించె.

పరాజయమునకు - అధ్యయనము వలన డస్సె.

ప్రమాదంబునకు - పాడివలనం బరాకు వడియె.

గ్రహణంబునకు - మైత్రుని వలన ధనంబు గొనియె.

భవనంబునకు - మనువు వలనం బ్రజలు పుట్టిరి.

త్రాణంబునకు - చోరునివలనం గాచె.

విరామంబునకు - భోగంబుల వలన విరమించె.

అంతర్ధికి - కృష్ణుండు తల్లి వలన దాఁగె.

వారణంబునకు - శోకంబువలన వారించె.

ఈ పంచమికి షష్ఠియుం గొండొకయెడల నగు.

చోఱునకు వెఱచె. పాపంబున కేవగించె. అధ్యయనంబునకు డస్సె.

పాడికిం బరాకువడియె. మనువునకు నిక్ష్వాకుండు పుట్టె - ఇత్యాదు లూహించునది.

౧౦. ఉండిపదం బొకానొకచో వలన వర్ణకంబున కనుప్రయుక్తంబగు.

హిమగిరివలన నుండి గంగవొడమె - నాకంబువలన నుండి నారదుండు వచ్చె.

౧౧. ఉండిశబ్దము పరంబగునపుడు వలనకు ద్వితీయాసప్తములు ప్రాయికంబుగ నగు.

వనమునుండి వచ్చె - వనమందుండి వచ్చె. ఊరినుండి వచ్చె - ఊరనుండి వచ్చె.

వనమునుంచి, ధనమునుంచి యని యుంచి శబ్దాను ప్రయోగంబుతోఁ గొందఱు వ్యవహరించెదరు. గాని యది సాధుకవి ప్రయోగారూఢంబుగాదని యెఱుంగునది.

౧౨. కంటెవర్ణకం బన్యార్థాది యోగజం బగు పంచమికగు.

రామునికంటె నన్యుండు ధానుష్కుండు లేఁడు. లోభంబుకంటె నితరంబు దోషంబు లేదు.

ఇచట షష్ఠియునగు.

రాముని కన్యుండు ధానుష్కుండు లేఁడు.

అన్యము - ఇతరము - పూర్వము - పరము - ఉత్తరము ఇత్యాదు లన్యాదులు.

౧౩. కంటెవర్ణకంబు నిర్ధారణపంచమి కగు.

ఎచ్చట నిర్ధార్యమాణంబు జాత్యాదులచే భేదంబు కలిగియుండు, నచటం బంచమియగు.

ఆ పంచమికిం గంటె వర్ణకంబగునని యర్థము.

జానపదులకంటె నాగరులు వివేకులు. మానహానికంటె మరణము మేలు.

౧౪. పట్టివర్ణకంబు హేతువులగు గుణక్రియల కగు.

జ్ఞానముఁబట్టి ముక్తుఁడగు - నీవు వచ్చుటంబట్టి ధన్యుడనయితి.

ఇచట వలన వర్ణకంబు నగు.

జ్ఞానము వలన ముక్తుండగు.

౧౫. శేషషష్ఠికి యొక్కయు నగు.

ఇచట శేషంబనఁగా సంబంధంబు.

రాముని యొక్క గుణములు - నా యొక్క మిత్రుఁడు - వానియొక్క తమ్ముఁడు.

కువర్ణకంబును గొన్ని యెడల సంబంధంబునం దగు.

నాకుం దమ్ముఁడు - మీకు నెచ్చెలి.

౧౬. నిర్ధారణషష్ఠికి లోపల వర్ణకంబగు.

జాతి గుణ క్రియా సంజ్ఞలచేత సముదాయంబునుండి యేకదేశంబునకుం బృథక్కరణంబు నిర్ధారణం బనంబడు. ఎద్దానివలన నిర్ధారణంబగు నచ్చటి షష్ఠికి లోపల వర్ణకం బగునని యర్థము.

మనుష్యులలోపల క్షత్రియుండు శూరుండు - గోవుల లోపలఁ గపిల బహుక్షీర - అధ్వగుల లోపలం బాఱువాఁడు శీఘ్రగామి - ఛాత్రులలోపలఁ మైత్రుండు సమర్థుండు.

ఇచట సప్తమియు గలదు.

మనుష్యులయందు క్షత్రియుండు శూరుండు. ఇత్యాదులెఱుంగునది.

౧౭. అధికరణంబునకు సప్తమి యగు.

అధికరణంబు నానాధారంబు.

ఔపశ్లేషికంబు వైషయికం బభివ్యాపకంబని యాధారంబు త్రివిధంబు.

ఘటమందు జలమున్నది - మోక్షమం దిచ్ఛ గలదు - అన్నిటియం దీశ్వరుండు గలడు.

౧౮. ఉకారాంత జడంబునకు నవర్ణకం బగు.

ఘటంబున జలంబున్నది - దేవదత్తునకు మోక్షమున నిచ్ఛ గలదు.

౧౯. విశేష్యంబునకుంబోలె విశేషంబునకు లింగవిభక్తి వచనంబు లగు.

నందతనయుండు కృష్ణుండు నాకు దిక్కు - దేవకీపుత్రు హరిని నుతింతు నెపుడు - శుభవిధాయుల రామకృష్ణుల భజింతు - భువనవంద్యను రుక్మిణిఁ బ్రస్తుతింతు.

౨౦. స్త్రీసమంబులగు విశేషణంబులయు ముపర్ణకాంత విశేషణంబులయు బహువచనంబున కేకవచనంబు బహుళంబుగానగు.

మాటలు పెక్కేల - మాటలు పెక్కు నేల.

కులిశధార ల్కుంఠింతం బయ్యె - కులిశధారల్కుఠితంబు లయ్యె.

ఇష్టమగు పదార్థములు - ఇష్టములగు పదార్థములు.

౨౧. ఒకానొకచో నొక విభక్తికి మఱియొక విభక్తియు నగు.

మైత్రుండు గృహమున వెడలెను - గృహమునుండి యని యర్థము.

వాఁడు వాహనమును దిగెను - వాహనమునుండి యని యర్థము.

వారు సుఖమున్నారు - సుఖముతో నని యర్థము. ఇత్యాదులెఱుంగునది.

౨౨. జడంబు తృతీయా సప్తములకు ద్వితీయ బహుళంబుగా నగు.

రాముఁడు వాలినొక్క కోలంగూలనేసె - కోలతో నని యర్థము.

లంకం గలకలంబు పుట్టె - లంకయందని యర్థము.

బాహుళకంబుచే నిక్కార్యం బుదంతంబునకు బహుత్వమందెయగు.

అర్జునుండు శత్రుసేనలను బాణంబులను రూపుమాపె - బాణములచే నని యర్థము.

మీనంబు జలంబులనుండు - జలంబులందని యర్థము.

౨౩. ఉదంత జడంబు తృతీయకు నవర్ణకం బగు.

రాముఁ డొక్క బాణంబున వాలింగూలనేసె - బాణముచే నని యర్థము.

౨౪. జడంబు ద్వితీయకుం బ్రథమ బహుళంబుగా నగు.

వాఁడు పూవులు దెచ్చె - వాఁడు పూవులను దెచ్చె.

ఆకె సొమ్ములు దాల్చె - ఆకె సొమ్ములను దాల్చె.

వాఁడిల్లు వెడలె - వాడింటిని వెడలె.

బహుళకముచేఁ దృతీయా సప్తములకు విధించిన ద్వితీయకుం బ్రథమ రాదు.

౨౫. కాలాధ్వములకుం బ్రాయికంబుగాఁ బ్రథమ యగు.

వాఁడు నిన్నవచ్చె - వీఁడు నేఁడు వోయె - మాపు నిలువుము - ఱేపు పొమ్ము - వారు క్రోశము నడచిరి - వీ రామడవోయిరి.

౨౬. సర్వనామ సంఖ్యాభిధాన తద్విశేష్యంబుల యందెయ్యది ముందు ప్రయోగింపబడు,

దాని ద్వితీయాదులకుం బ్రథమ బహుళంబుగా నగు.

అన్ని గుఱ్ఱములకు - అన్నింటికి గుఱ్ఱములకు - గుఱ్ఱము లన్నింటికి - గుఱ్ఱముల కన్నింటికి సాహిణులు ముువ్వురు.

రెండు గుఱ్ఱములకు - రెంటికి గుఱ్ఱములకు - గుఱ్ఱములు రెండింటికి - గుఱ్ఱములకు రెండింటికి సాహిణులు నలుగురు.

లక్ష గుఱ్ఱములకు - లక్షకు గుఱ్ఱములకు - గుఱ్ఱములు లక్షకు - గుఱ్ఱములకు లక్షకు - గుఱ్ఱములకు లక్షకు రవుతులు లక్ష - ఇత్యాదు లెఱుంగునది.

౨౭. ఒకానొకచో విశేషణంబుల షష్ఠికిం బ్రథమ విభాష నగు.

సుగుణాభిరాముఁడు రామునకు జోహారు వొనర్చెద - సుగుణాభిరామునకు రామునకు జోహారు వొనర్చెద.

౨౮. భవత్యర్థ వ్యవహితంబులగు విశేషణంబులకుం బ్రథమ యగు.

అగు మొదలగునవి భవత్యర్థములు.

విద్యాశాలియగు పురుషుని సకల జనులు సన్మానింతురు.

భూతదయాళురగు మహాత్ములకు శ్రేయంబు గలుగును.

అతిమానుష మత్యద్భుత మతిదుష్కర మయిన కేశవార్జున కృతి.

౨౯. భవత్యర్థకంబు సన్నిహిత విశేషణంబునకును, దాని ముందు విశేషణంబుల

కయి పదంబును బహుళంబుగా ననుప్రయుక్తం బగు.

అతులుఁడయి యప్రమేయుఁడౌ హరిని గొలుతు.

౩౦. అయి పదానుప్రయోగంబు లేనిచోఁ దుదివిశేషణంబున కేని, విశేషణంబు లన్నింటికేని

మీఁద సముచ్చయార్థంబు విభాషం బ్రయోగింపఁబడు.

ఆద్యుఁ డప్రమేయుఁడు నగు హరిని గొలుతు.

ఆద్యుఁడు నమేయ గుణుఁడు నౌ హరిని గొలుతు.

ఆద్యుఁ డప్రమేయుండగు హరిని గొలుతు.

౩౧. ధాతుజ విశేషణ వ్యవధానంబున విశేషణంబు లన్నింటి కయి పదంబనుప్రయుక్తం బగు.

ఆద్యుఁడయి యప్రమేయుఁడై యఖిల సేవ్యుఁడై యెసంగెడు దేవుని నభినుతింతు. ఇచట మఱియుం ప్రయోగ వైచిత్ర్యంబు గలదది ప్రయోగంబుల నెఱుంగునది.

౩౨. భావార్థకాది యోగంబునం గర్తకుం బ్రథమ యగు.

రాముఁడు వచ్చుట - రాముఁడు రాఁగా లక్ష్మణుఁడు గాంచె - రాముఁడు విల్లందినం ద్రిలోకంబు లాకులంబులగు - రాముఁడు పట్టిన ప్రతిన వారింపం దరంబుగాదు.

౩౩. ప్రథమాంతంబు లగు యుష్మ దస్మ ద్విశేషణంబుల కేకత్వంబున

వు ను లు ను బహుత్వంబున రు ము లు నంతాగమంబులు ప్రాయికంబుగ నగు.

౩౪. ఈ యాగమంబులు పరంబులగునపు డుత్వంబున కత్వం బగు.

నీవు ధన్యుఁడవు - నేను ధన్యుఁడను - మీరు ధన్యులరు - మేము ధన్యులము.

ఇకారంబు మీఁది కు-ను-వు క్రియా విభక్తుల యుత్వంబున కిత్వంబగు నను సూత్రముచేత వు ను ల కిత్వంబగు.

నీవు సుకృతివి - నేను సుకృతిని - ఆర్తి హరుఁడ వౌ నినుఁ గొల్తు నంబుజాక్ష - గర్వ గర్విష్ఠుండను నన్ను - మీరలు పెద్దలు - ఇత్యాదులు ప్రాయిక గ్రహణముచే రక్షితంబులయ్యె.

౩౫. అది శబ్దంబునకు వు ను లు పరంబు లగునపుడును

సంబోధనంబు నందును దాన యను నాదేశం బగు.

నీవు చిన్నదానవు - నేను జిన్నదాన - ఓ చిన్నదాన.

౩౬. అన్య యుష్మ దస్మ త్కార్యంబులం దుత్తరోత్తరంబు బలీయంబు.

వారును మీరును ధన్యులరు - మీరును మేమును ధన్యులము.

౩౭. ఏక వాక్యంబునం దొకానొక్కండు తక్క సర్వపదంబులు

క్రమ నిరపేక్షంబుగం బ్రయోగింపం జను.

పూర్వమిది పరమిది యను నియమ మపేక్షింపక వాక్యమందెల్ల పదంబులు వలచినట్లు ప్రయోగింపదగును.

ఏని ప్రభృతి శబ్దములు కొన్ని నియమ సాపేక్షంబు లయియుండు.

గాలి చల్లగా వీచెను - వీచెను జల్లగా గాలి - చల్లగా గాలి వీచెను - వీచెను గాలి చల్లగా - గాలి వీచెను చల్లగా - చల్లగా వీచెను గాలి.

ఇది కారక పరిచ్ఛేదము.



# సమాస పరిచ్ఛేదము.

౧. సమర్థంబులగు పదంబు లేకపదం బగుట సమాసంబు.

ప్రథగ్భూతంబులగు నర్థంబుల కేకార్థీభావంబు సమర్థ్యంబు.

పృథక్ప్రసిద్ధార్థంబులగు పదంబుల కేకార్థంబునందు వృత్తి సామర్థ్యము.

౨. సాంస్కృతికాచ్ఛిక మిశ్రభేదంబుచే సమాసంబు త్రివిధంబు.

సాంస్కృతికంబని యాచ్ఛికంబని మిశ్రంబని సమాసంబు త్రివిధంబు.

అందు సాంస్కృతికంబు సిద్ధంబని సాధ్యంబని ద్వివిధంబు.

కేవల సంస్కృత శబ్దంబుల సమాసంబు సిద్ధంబు నాఁబడు.

రాజాజ్ఞ - తటాకోదకము - లక్ష్మీవల్లభుఁడు.

సంస్కృత సమంబుల సమాసంబు సాధ్యంబు నాఁబడు.

రాజునాజ్ఞ - తటాకంబు నుదకము - లక్ష్మీవల్లభుఁడు.

తక్కిన తెనుఁగుల సమాసం బాచ్ఛికం బనంబడు.

ఱేని యానతి - చెఱువు నీరు - సిరి చెలువుఁడు.

ఉభయంబు గూడినది మిశ్రమంబనంబడు.

రాజు ముదల - చెరువునుదకము - సిరివల్లభుఁడు.

౩. తత్పురుషాదులకు లక్షణంబు ప్రాయికంబుగ సంస్కృతోక్తంబ యగు.

తత్పురుష బాహువ్రీహి ద్వంద్వంబునని సమాసంబులెల్లం ద్రివిధంబులయి యుండు.

అవి ప్రాయికంబుగా నుత్తరాన్యోభయపదార్థ ప్రధానంబు లయియుండు. అందుఁ దత్పురుషంబు వ్యధికరణంబని సమానాధికరణంబని ద్వివిధంబు.

ద్వితీయాదులకు మీఁది పదఁబుతోడ సమాసంబు వ్యధికరణంబు నాఁబడు.

నెలతాల్పు - నెల తక్కువవాఁడు - దేవరమేలు - దొంగభయము - రాముని బాణము - మాటనేర్పరి.

విశేషణంబునకు విశేష్యంబుతోడ సమాసంబు సమానాధికరణంబు నాఁబడు.

ఇదియె కర్మధారయంబు నాఁబడు.

సరసపు వచనము - తెల్ల గుఱ్ఱము - మంచిరాజు.

ఇది సంఖ్యాపూర్వంబు ద్విగువునాఁబడు.

ముజ్జగములు - ముల్లోకములు.

బాహువ్రీహి

ముక్కంటి - చలివెలుఁగు.

ద్వంద్వము

తల్లిదండ్రులు - అన్నదమ్ములు.

ప్రాయికంబుగా ననుటచే సంస్కృత లక్షణంబుఁ దొడరని సమాసంబుం గలదని సూచింపంబడియె. దానంజేసి చిగురుఁగేలు - జుంటిమోవి ఇత్యాదులయిన యుపమాన పూర్వపద కర్మధారయంబులు గ్రాహ్యంబులు.

ముఖపద్మము - చరణకమలములు.

ఇట్టి యుపమానోత్తర పదంబులు గలవుగాని విపరీతంబులు సిద్ధంబులు లేవని యెఱుంగునది.

సిద్ధంబు సర్వంబు గ్రాహ్యంబు.

రాజపురుషుఁడు - నీలోత్పలము - పీతాంబరుఁడు - రామలక్ష్మణులు.

కేవల సంస్కృత శబ్దము వికృతి శబ్దముతోడ సమసింపదు.

దానంజేసి యనేకమాఱు లల్పదండిత్యాదులు దుష్టములని తెలియునది.

౪. ఆ ఈ ఏ యను సర్వనామంబులు త్రికంబు నాఁబడు.

౫. కర్మధారయంబు త్రిక స్త్రీ సమముగంత ధాతుజ విశేషణపూర్వపదం బయి యుండు.

ఆ చందము - ఈ చందము - ఏ బృందము - వాఁడిమాట - పోఁడిపాట - బెడిదపుటడిదము - మడిసెడుదడములు.

ఈ నియమముచేఁ బల్లిదుఁడు మల్లుఁడు - కావాలుఁడు వారణుఁడు ఇత్యాదుల సమాసంబు లేదు.

౬. స్త్రీ సమఘటితంబ యొకానొకండు బహువ్రీహి చూపట్టెడు.

ముక్కంటి - వేగంటి - చలివెలుఁగు - వేవెలుఁగు - మోటబరి ఇత్యాదులు వ్యవహార సిద్ధంబులు గ్రాహ్యంబులు.

౭. ఆచ్ఛికశబ్దంబుతోడ స్త్రీ సమంబు ప్రాయికంబుగా ద్వంద్వం బగు.

అన్నదమ్ములు - తల్లిదండ్రులు - ఊరుపల్లెలు - ఆలుమగలు. మగఁడును బిడ్డలును - పల్లమును గళ్ళెమును ఇత్యాదులు సమసింపవని యీ నియమంబున నెఱుంగునది.

౮. సర్వశబ్దంబులు సంబంధమునందుం దచ్ఛబ్దంబుతోడ సమసించు.

నావాఁడు - నాయది - ఇంటివాఁడు - ఇంటిది - రామునివాఁడు - రామునిది.

౯. ధాతుజ విశేషణంబులకు విభక్తి వివక్షించునపుడు తచ్ఛబ్దం బనుప్రయుక్తంబగు.

వచ్చినవాఁడు - వచ్చినది - రానివాఁడు - రానియది.

౧౦. ఎల్ల యెడల ధాతుజ విశేషణంబుల కట్టి యను పదంబు విభాష ననుప్రయుక్తం బగు.

వచ్చినట్టి రాముఁడు - వచ్చిన రాముఁడు - వచ్చునట్టి వాఁడు - వచ్చువాఁడు.

౧౧. యుష్మదస్మదాత్మార్థకంబుల కుత్తరపదంబు పరంబగునపుడు దుగాగమంబు విభాష నగు.

నీదు కరుణ - ని కరుణ, నాదు నేరిమి - నా నేరిమి, తనదు రూపు - తనరూపు.

౧౨. గుణవచనంబు లగు నల్లాదులకుం గర్మధారయంబునందు నిగాగంబు బహుళంబుగా నగు.

నల్లని గుఱ్ఱము - నల్ల గుఱ్ఱము.

నల్ల - తెల్ల - పచ్చ - యెఱ్ఱ - చామ - తియ్య - కమ్మ - పుల్ల - విన్న - తిన్న - అల్ల ఇత్యాదులు నల్లాదులు.

౧౩. ద్విరుక్తం బగు హల్లు పరంబగునపు డాచ్ఛికం బగు దీర్ఘంబునకు హ్రస్వంబగు.

౧౪. త్రికంబుమీఁది యసంయుక్త హల్లునకు ద్విత్వంబు బహుళంబుగా నగు.

అక్కన్య - ఆ కన్య, ఇక్కాలము - ఈ కాలము, ఎల్లోకము - ఏ లోకము, అయ్యశ్వము - ఆ యశ్వము.

బహుళకముచే నూష్మరేఫంబు లగు ద్విత్వంబు గలుగదు.

ఆ రూపము - ఏ శబ్దము - ఏ షండము - ఆ సుకృతి - ఆ హయము.

౧౫. కృత హ్రస్వంబగు త్రికంబు మీఁది చోటు శబ్దంబు నోత్వంబున కత్వ హ్రస్వంబులు విభాషనగు.

అచ్చోటు - అచ్చటు - అచ్చొటు, ఇచ్చోటు - ఇచ్చటు - ఇచ్చొటు, ఎచ్చోటు - ఎచ్చటు - ఎచ్చొటు.

వీని ద్విత్వంబునకు వక్ష్యమాణవిధిచేఁ బాక్షికంబుగ లోపంబగు.

అచటు - అచొటు - ఇచటు - ఇచొటు - ఎచటు - ఎచొటు - ముచ్చొటులు - ముచ్చటులు - ముచ్చొటులు అను రూపంబగు ప్రయోగంబులం గానంబడియెడి.

౧౬. ఉత్తరపదం బగు చోట శబ్దముటాక్షరమునకు లోపంబు విభాష నగు.

చోటు శబ్దం బౌపవిభక్తికంబు గావున దాని యంతిమాక్షరంబు సప్తమ్యాదేశమయిన యకారంబుతోడం బాక్షికంబుగ లోపించునని యర్థము.

అచ్చోనున్నాఁడు - అచ్చోట నున్నాఁడు, ఒకచో నుండె - ఒకచోట నుండె.

౧౭. సమానాధికరణంబగు నుత్తరపదంబు పరంబగునపుడు మూఁడు శబ్దము డుజ్వర్ణంబునకు

లోపంబును మీఁది హల్లునకు ద్విత్వంబునగు.

మూఁడు జగములు - ముజ్జగములు, మూఁడు లోకములు - ముల్లోకములు.

౧౮. ద్విగువున కేకవచనంబు ప్రాయికంబుగా నగు, మిశ్రంబునకుఁ గాదు.

ముచ్చిచ్చు - ముక్కారు - ముప్పాతిక - ముత్త్రోవ - ముప్విధములు.

౧౯. కొండొకచో సమాసంబులందు నామ్వాది కనుమ్వాదుల మువర్ణంబులు పజ్వవర్ణంబు లగు.

నాఁపచేను - పాఁపఁఱేడు.

కనుపపులు - జనుపనార - నాము - పాము - ప్రేము - వేము - అమ్ము - ఎమ్ము - ఇవి నామ్వాదులు.

కనుము - ఇనుము - ఉడుము - ఎనుము - జనుము - మినుము ఇత్యాదులు కనుమాదులు.

౨౦. నిక్కలాదులు యథా ప్రయోగంబుగ గ్రాహ్యంబులు.

నిక్కల - కవ్వడి - పువ్విలుకాఁడు ఇత్యాదులు.

౨౧. ఆకారంబున కామ్రేడితంబునకుం దదర్థకంబున కయి యాయి యను శబ్దంబులు విభాష నగు.

వక్ష్యమాణ విధిచేత నయి యనుదాని కైకాదేశంబునగు.

ఆయయికాలము - ఆయాయికాలము - అయ్యాయికాలము - అయ్యాయికాలము - అయ్యైకాలము - అయ్యోకాలము - ఆయాకాలము - ఆయక్కాలము - అయ్యాక్కాలము - అయ్యక్కాలము.

౨౨. బహువ్రీహిని సమాసాంత కార్యంబులుం గానంబడి యెడి.

ముక్కంటి - కడలిరాచూలి - నలువ - గట్టువిలుతుఁడు.

౨౩. బహువ్రీహిని స్త్రీవాచ్యం బగుచో నుపమానంబు మీఁది మేనునకుఁ బోఁడి యగు.

అలరుబోఁడి - ననబోఁడి - పూబోఁడి - విరిఁబోఁడి.

౨౪. ద్వంద్వంబునందు ఋకారంబునకు ర వర్ణంబు విభాషనగు.

మాత్రుపితలు - మాతాపితలు ఇత్యాదులు.

౨౫. సమాస విభక్తికి లోపంబగు లట్టునకుం గాదు.

రాముని బాణములు - సరసపు వచనములు - వేవెలుఁగు - గుణములప్రోక.

౨౬. కర్మాదులకుఁ బ్రాధాన్య వివక్షయందు ధాతుజవిశేషణంబులు కర్తతోడంబోలె వానితోడ సమసించు.

రాముఁడు రక్షించిన భృత్యుఁడు - రాముఁడు వాలినేసిన బాణము - రాముఁడు గోవునిచ్చిన విప్రుఁడు - రాముఁడు వెడలిన వనంబు - రాముఁడు వసించిన పర్ణగృహము - రాముఁడు వసించిన చోటు.

ఇది సమాస పరిచ్ఛేదము.



# తద్ధిత పరిచ్ఛేదము.

౧. తనవర్ణకంబు త్వార్థంబునం దగు.

త్వార్థంబనఁగా భావంబు. ప్రకృతి జన్యబోధంబునందుఁ బ్రకారంబు భావంబు.

రాముని తనము - రాముతనము - మనుమని తనము - సీతతనము - గొప్పతనము - కొఱతనము - నల్లఁదనము - పుల్లదనము.

౨. ఇట విశేషంబుత్సర్గంబునకు విభాషను బాధకం బగు.

స్పష్టము.

౩. చిన్నాదులకు ఱిక వర్ణం బగు.

చిన్నఱికము - కన్నెఱికము.

చిన్న - కన్నె - చుట్టము - దొంగ - పేద - మిండ - లంజె - ఇత్యాదులు చిన్నాదులు.

౪. ఉత్వంబున కత్వంబు ఱికము పరంబగునపు డగు.

తొత్తఱికము - వెడ్డఱికము - వెజ్జఱికము.

౫. పేర్వాదుల కిమివర్ణకం బగు.

పేరిమి - కడిమి.

పేరు - కడు - మ్రుచ్చు - మేలు - చెలి- పోఁడి - వాఁడి - వేఁడి ఇత్యాదులు పేర్వాదులు.

౬. నవర్ణకంబు గుణవచనంబు లగు నల్లాదుల కగు.

నల్లన - తెల్లన.

నల్ల - తెల్ల - పచ్చ- ఎఱ్ఱ - చామ - తియ్య - కమ్మ - పుల్ల - చప్ప - విన్న - తిన్న - అల్ల - ఒయ్య - తిమ్మ - చక్క - వ్రేఁక - ఇత్యాదులు నల్లాదులు.

౭. ఇక వర్ణకం బగ్గలాదుల కగు.

అగ్గలిక - ఒమ్మిక - అగ్గము - ఒమ్ము.

౮. మగఁటిమ్యాదులు యథాప్రయోగంబుగ గ్రాహ్యంబులు.

మగఁటిమి - మగతనము - పేఱిమి.

ఒజ్జనము - కోటరము - కోడండ్రము - కోడంట్రికము - కోడఱికము - కోమలికము - చెలికారము - తెలుపు - ఎఱుపు - పసుపు - నలుపు.

ఱికాదులు రాని పక్షమందుఁ దన ప్రత్యయం బన్నింటికగు.

చిన్నతనము - ముచ్చుఁదనము - నల్లదనము - అగ్గలంపుఁదనము - ఒజ్జతనము.

౯. అరమరాదులకు స్వార్థంబునం దికవర్ణకం బగు.

అరమరిక - ఆమిక.

అరమర - ఆము - అల్లిబిల్లి - గండి - నడవడి - నాడు - నివ్వాళి - పొత్తి - మాని - మెలి - వాలు - ఇత్యాదు లరమరాదులు.

౧౦. ఉకవర్ణకంబు చిఱుతాదులకు స్వార్థంబునం దగు.

చిఱుతుక - నాతుక.

చిఱుత - నాతి - నెలఁత - మెలఁత - పడఁతి - మడఁతి - పొలఁతి - వెలఁది - నిప్పు - ఎమ్ము ఇత్యాదులు చిఱుతాదులు.

౧౧. కా కత్తియ వర్ణకంబులు పుంస్త్వస్త్రీత్వంబుల మతుబర్థంబునం దాటాదుల కగు.

కాప్రత్యయాంతంబునకు మగాది గణగణనంబునం జేసి డుజ్జగు.

ఆటకాఁడు - ఆటకత్తియ.

ఆట - అడపము - ఎమ్మె - ఒయారము - కటారి - కొల్ల - చెలిమి - చేరువ - చొరవ - జట్టి - జామర - జూదము - తిండి - తేర - దొద్ద - నీటు - నేస్తము - బేరము - వగ - విలు - వెచ్చము - సొగసు - ఇత్యాదు లాటాదులు.

౧౨. కా కత్తియల కకారంబునకు గకారంబు కొండొకచోఁ గానంబడియెడి.

అందగాఁడు - అందగత్తియ, కొండెగాఁడు - కొండెగత్తియ, బేరగాఁడు - బేరగత్తియ ఇత్యాదులు.

౧౩. కా కత్తియలు కొండొకవానికి స్వార్థంబునం జూపట్టెడు.

చెలికాఁడు - చెలికత్తియ, హెగ్గడికాఁడు - హెగ్గడికత్తియ.

౧౪. కా వర్ణకంబు తిర్యక్కులకుం గానంబడియెడి.

ఇబ్బందిగాఁడు - ఒంటిగాఁడు - కొమ్ముగాఁడు - పరికాఁడు - ఇత్యాదులు మృగవిశేష వాచకంబులు.

౧౫. అటమటాదులకు మతుబర్థంబునం దీవర్ణకంబు పుంస్త్వంబునం దగు.

ఈ ప్రత్యయాంతంబు మగాదిగణంబు.

అటమటీఁడు - కమ్మతీఁడు.

అటమటము - కమ్మతము - కన్నడము - కొండెము - బానసము - బూటకము - మందడి - మన్నెము - సుంకము.

ఉక్కివంబునకు వలోపంబునగు.

ఉక్కీఁడు ఇత్యాదులు.

౧౬. ఈ ప్రత్యయంబు కొన్నింటికి స్వార్థంబునం దగు.

మొక్కలీఁడు - కల్లరీఁడు.

౧౭. అరివర్ణకంబు మతుబర్థంబున జాలాదుల కగు.

జాలరి - ఒఱపరి.

జాల - ఒఱపు - కల్ల - చదువు - జూదము - టక్కు - తగవు - తీరుపు - తెంపు - తెరువు - నేరువు - మతకము - వెరపు - వేఁట - సిగ్గు - సుంకము ఇత్యాదులు.

౧౮. ఇ వర్ణకం బోయారాదులకు మతుబర్థంబునం దగు.

ఓయారి - అక్కసి.

ఓయారము - అక్కసము - కడలు - చాగము - జోగము - మతకము - తుటారము - బండారము - బిత్తరము - బిటారము - బేహారము - మచ్చరము - మిటారము - విన్నాణము - వెక్కసము - ఇత్యాదులు.

౧౯. త వర్ణకంబు కులవాచకంబునకు స్త్రీవాచ్యం బగునపుడు మతుబర్థంబునం దగు.

కొఱవత - చాకిత.

కొఱవ - చాకి - బోయ - వాని - ప్రే - సారె -ఇత్యాదులు కులవాచకంబులు.

౨౦. త వర్ణకంబు పరంబగుచో నొకానొకచో నెత్వంబు చూపట్టెడు.

చెంచెత - మాలెత.

౨౧. యువతి విటీ రజస్వలలు గుబ్బెత మిండత ముట్టుతలు నాఁబడుదురు.

స్పష్టము.

౨౨. వగాదులకు బహువచనాంతంబులకు స్త్రీవాచ్యం బగునపుడు మత్వర్థంబునం దాఁడివర్ణకం బగు.

వగలాఁడి.

వగ - చిన్నె - కులుకు - వన్నె - దొమ్మి - ఎమ్మె - ఇత్యాదులు వగాదులు.

౨౩. వగాదులకు బహువచనంబులకుఁ బుంస్త్వంబున మతుబర్థం బాకారం బగు.

అప్రత్యయాంతంబు మగాదిగణంబు.

వగలాఁడు - చిన్నెలాఁడు.

౨౪. ముక్కు లోనగువానికిఁ దదభావ ద్యోతకం బయి మతుబర్థంబునం దిఁడివర్ణకం బగు.

ముక్కిఁడి. ముక్కు లేనివాఁడని యర్థము.

ముక్కు - వాలు - వెరవు - సిగ్గు ఇత్యాదులు ప్రయోగంబుల నెఱుంగునది.

౨౫. మానార్థంబున కేకత్వంబునం దెఁడువర్ణకం బగు.

తూమెఁడు - ముంతెఁడు - ఎత్తెఁడు - వీసెఁడు - జేనెఁడు - మూరెఁడు - కుందెఁడు - గంపెఁడు.

౨౬. ఎఁడువర్ణకంబు పరంబగునపుడు లివర్ణంబు లోపించు.

కమికెఁడు - కొడిదెఁడు - దోసెఁడు - పిడికెఁడు - పుడిసెఁడు, సందెఁడు.

౨౭. దఘ్నార్థంబున బంటి కొలఁదు లగు.

మోకాఁలిబంటి - మోకాఁలికొలఁది, ఱొమ్ముబంటి - ఱొమ్ముకొలఁది

౨౮. అర్థవిశేషంబుల వర్ణకాంతరంబులును మహత్ప్రయోగంబుల నెఱుంగునది.

మంటమారి - తిండిపోతు - తాచ్ఛీల్యంబున మారి పోతు వర్ణకంబులు.

అడప - తాంబూలకరండవాహి - మతుబర్థంబునం దప్రత్యయంబు పెండ్లము - ఊఢ - పెండ్లి శబ్దంబునకు దము ప్రత్యయంబు. ఇత్యాదు లూహ్యంబులు.

ఇది తద్ధిత పరిచ్ఛేదము.



# క్రియా పరిచ్ఛేదము.

౧. ధాతువునకు.

ఇది అధికార సూత్రంబు. ఇంక నెయ్యది యుపక్రమింపం బడునయ్యది ధాతువున కగునని యెఱుంగునది.

౨. వర్తమానంబున ల ట్టగు.

వర్తమాన క్రియావృత్తియగు ధాతువునకు లడ్వర్ణకంబగు. వర్తమానంబు నాఁ బ్రారబ్ధాపరిసమాప్తంబుం - అప్పటికి ముగియకుండునది.

౩. భూతంబున లి ట్టగు.

భూతక్రియావృత్తియగు ధాతువునకు లిడ్వర్ణకంబగు. భూతంబు నా విద్యమాన ధ్వంస ప్రతియోగి - ముందుండి యప్పటికి లేకుండునది.

౪. భావిని లృ ట్టగు.

భావిక్రియావృత్తి యగు ధాతువునకు లృడ్వర్ణకంబగు. భావి నా విద్యమాన ప్రాగభావ ప్రతియోగి - అప్పటికిఁ బుట్టకుండునది.

౫. తద్ధర్మాదులందు లా ట్టగు.

తద్ధర్మాతి క్రియావృత్తియగు ధాతువునకు లాడ్వర్ణకంబగు. తచ్ఛీల సంభావనా సంప్రశ్న సాతత్య వర్తమాన భావ్యాశీరాదులాదిపద గ్రాహ్యంబులు.

౬. ఆశీశ్శాస సంప్రార్థనవిధులందు లూ ట్టగు.

ఆశీరాదులందు ధాతువునకు లూడ్వర్ణకంబగు.

౭. వ్యతిరేకంబున లజీ యగు.

వ్యతిరేక విశిష్ట క్రియావృత్తియగు ధాతువునకు లజీవర్ణకంబగు.

౮. లకారంబునకు డుఙ్రువురును ముఙ్ణీగు.

లడాది లకారంబులం దొక్కొక్కటికి డుజాదు లాదేశంబులగు.

ఇందు ఞాకారంబు ప్రత్యాహారార్థంబు.

౯. అందు వరుసను రెండేసి ప్రథమమధ్యమోత్తమంబు లనంబడు.

డుజ్ - రు - ప్రథమము, వు - రు మధ్యమము, ను - ము ఉత్తమము.

౧౦. వానిలో రు ము లు బహువచనంబులు, పెఱ లేకవచనంబులు.

౧౧. నామ యుష్మదస్మ దర్థములందుం బ్రథమమధ్యమోత్తమంబు లగు.

౧౨. అమహదర్థంబునందు డుఙ్రులకు దు వు లగు, నున్నానుబంధంబు మీఁద దివియగు.

౧౩. ఉదంతంబునకు లట్టు పరంబగునపు డున్నానుబంధం బగు.

ఉదంతంబయిన ధాతువునకు లట్టు పరంబగునపుడు - ఉన్న అను శబ్దంబనుప్రయుక్తంబగు.

౧౪. ఉన్న శబ్దంబు పరంబగునపుడు చువర్ణకం బగు.

౧౫. దివీతరం బగు డుణ్ణు పరంబగునపు డున్నానుబంధంబు నకు దీర్ఘం బగు.

ప్రథమము: వాఁడు వండుచున్నాడు - వారు వండుచున్నారు - అది వండుచున్నది - అవి వండుచున్నవి.

మధ్యమము: నీవు వండు చున్నావు - మీరు వండుచున్నారు.

ఉత్తమము: నేను వండుచున్నాను - మేము వండుచున్నాము.

౧౬. లిడ్లాట్టుల డుజ్జున కెను ను వర్ణంబు లగు.

లిడాదేశంబగు డుజ్జునకు - ఎను - అనునదియు, లాడా దేశంబగు డుజ్జునకు - ను అనునదియు నాదేశంబగు.

౧౭. భూతంబునం దిగాగమం బగు.

భూతార్థ వృత్తియగు ధాతువున కిగాగమంబగు.

౧౮. లిట్టు వుజ్జు పరంబగునపుడు తి వర్ణకం బగు.

ఇకారంబు మీఁది కు - ను - వు క్రియా విభక్తుల యను సూత్రముచే రుణ్ణున కిత్వంబు.

ప్ర: వండెను, వండిరి.

మ: వండితివి, వండితిరి.

ఉ: వండితిని, వండితిమి.

౧౯. కలజ్యనుబంధంబు లృట్టు పరంబగునపు డగు.

లృట్టు పరంబగునపుడు ధాతువునకు - కలజీ అనునది యనుప్రయుక్తంబగు.

౨౦. జీత్తు పరంబగునపు డుత్వంబున కత్వం బగు.

జీత్తు పరంబగునపుడు ధాతువు నుత్వంబున కత్వంబగు.

౨౧. కలజి పడుజులు పరంబులగునపుడు నుగాగమం బగు.

ద్రుతకార్యంబు.

ప్ర: వండఁగలడు - వండఁగలరు - వండఁగలదు - వండఁగలవు.

మ: వండఁగలవు - వండఁగలరు.

ఉ: వండఁగలను - వండఁగలము.

౨౨. లాట్టు రుఙ్ఞు పరంబగునపుడు దుగాగమం బగు.

ప్ర: వండును - వండుదురు.

మ: వండుదువు - వండుదురు.

ఉ: వండుదును - వండుదుము.

లాడర్థంబులయం దోలి నుదాహరణంబులు వక్కాణించెద.

తద్ధర్మంబు: కులాలుఁడు కుండలు వానును.

తచ్ఛీలంబు: జ్వలనజ్వాలంబు లుప్పరం బెగయును.

సంభావన: ఇప్పుడు వాడింటనుండును.

సంప్రశ్నము: ఉందునా - పోదునా.

సాతత్యము: సర్వంబునం దీశ్వరుఁడుండును - సర్వంబీశ్వరుని యందుండును.

వర్తమానంబు: మేననిప్పుడుం బులకలు వొడమెడును.

వక్ష్యమాణవిధిచేఁ బ్రాయికంబుగ వర్తమానంబునం దెడు గాద్యాగమంబులగు.

భావి: వాఁడు ఱేపు వచ్చును.

ఆశీస్సు: శుభం బగును.

వచ్యర్థంబుల కొకానొకచో భూతంబున లాట్టు గానం బడియెడును.

౨౩. లాట్టు రుఙ్ఞు పరంబగునపు డెదగాగమంబును, బ్రథమ నువర్ణకంబు పరంబగునపు డెడు గెడి గాగమంబులును బహుళంబుగా నగు.

ప్ర: వండెడును - వండెడిని - వండెదరు.

మ: వండెదవు - వండెదరు.

ఉ: వండెదను - వండెదము.

౨౪. లిడ్లాట్టుల వకారంబునకు లోపంబు విభాష నగు.

వండితి - వండితిని, వండుదు - వండుదువు, వండెదు - వండెదవు.

౨౫. తిర్యగ్జడంబులు వాచ్యంబు లగునపుడు లిడ్లాట్టుల ప్రథమ బహువచనంబున కేకవచనం బగు.

చిలుకలు వలికెను - చిలుకలు వలుకును - చిలుకలు వలికెడును.

మేఘములు గర్జిల్లెను - మేఘములు గర్జిల్లును - మేఘములు గర్జిల్లెడును.

౨౬. లూట్టు డుణ్ణున కెడు త వర్ణంబులు ద్రుతాంతంబులగు.

ఆశీస్సు: మీకు మేలు గలిగెడును - మీకు మేలు గలుగుతను.

శాపంబు: నీకు రాక్షసత్వంబు గలిగెడును - నీకు రాక్షసత్వంబు గలుగుతను.

సంప్రార్థనంబు: హరి నను౯ గృపగాంచెడును - హరి నను౯ గృప గాంచుతను.

౨౭. విధియందు లూట్టునకు మాఱుగా నది యను తచ్ఛబ్దంబును ముందు నుగాగమంబు నగు.

మైత్రుండు నా నిర్దిష్ట కార్యంబు చేయునది. వానికి నీవు బాసటయయి యుండునది.

౨౮. ఎడు త ల ద్రుతంబున కచ్చు పరంబగునపుడు మకారం బగు.

నీకు మేలు గలిగెడు మనియెను - నీకు మేలు గలుగుత మనియెను.

౨౯. లూణ్మధ్యమ వు రు లకు ముడుజ్ఞు లగు.

ఆశీస్సు: దీర్ఘాయువ వగుము - దీర్ఘాయులరగుఁడు.

శాపంబు: రాక్షసుఁడ వగుము - రాక్షసులరగుఁడు.

సంప్రార్థనంబు: నన్ను రక్షింపుము - నన్ను రక్షింపుఁడు.

విధి: నా చెప్పిన పని చేయుము - నా చెప్పిన పని చేయుఁడు.

౩౦. ఉభయప్రార్థనంబునం దుగాగమంబున కత్వం బగు.

మనము వండుదము.

౩౧. మధ్యమ ముడుఙ్ఞులు ముఙ్ఞులు నాఁబడు.

జీత్తుపరంబగునపు డుత్వంబున కత్వంబగునను సూత్రముచే లజిపరంబగునపుడు డత్వంబు. ప్ర: వండఁడు - వండరు - వండదు - వండవు.

మ: వండవు - వండరు.

ఉ: వండను - వండము.

౩౨. వ్యతిరేకంబున ముఙ్ఞు పరంబగునపుడు కుజీ యగు.

నీవు వండకుము - మీరు వండకుఁడు.

౩౩. సంప్రార్థనంబుల ముఙ్ఞున కదాదులు విభాష ననుప్రయుక్తంబు లగు.

వండుమ - వండుమా - వండుమి - వండుమీ - వండుఁడ - వండుఁడా - వండుఁడి - వండుడీ.

అ - ఆ - ఇ - ఈ - ఎ - ఏ - ఒ - ఓ - అమ్మ - అయ్య ఇత్యాదు లదాదులు.

౩౪. ఎదాదు లనుప్రయుక్తంబులగునపుడు ముఙ్ఞునకు వుజీ రుజీ యగు.

వినవె - వినవే - వినరె - వినరే - వినకువె - వినకువే - వినకురే.

౩౫. ట వర్ణకంబు భావంబునం దగు.

భావంబనఁగా ధాత్వర్థంబు.

వండుట - పండుట - వినుట - కనుట.

౩౬. కఁజీ వర్ణకంబు పురార్థయోగంబున విభాషను భావంబునం దగు.

వండక మునుపు - వండుటకు మునుపు - చేయక మునుపు - చేయుటకు మునుపు - మునుపు - ముందు - మున్ను - తొల్లి.

౩౭. వ్యతిరేకభావంబున మిఁజీ యగు.

వ్యతిరేక విశిష్ట క్రియాభిదాయి ధాతువునకు మిఁజీయగు.

వండమి - పండమి.

౩౮. సమానాశ్రయంబులం బూర్వకాలంబునం దివర్ణకంబగు.

ఏకాశ్రయంబులకు క్రియలలోపల నెయ్యేది పూర్వకాలికం బగుం దద్వాచియగు ధాతువున కివర్ణకం బగు. ఇదియె క్త్వార్థంబు నాఁబడు.

వండి - పండి - విని - కని.

సమాన కర్తృకంబులనక సమానాశ్రయంబులనుటంజేసి చైత్రునిచేత మైత్రుండు కొట్టంబడి మడిసె నిత్యాది సిద్ధంబయ్యె.

౩౯. కఁజీ వ్యతిరేక క్త్వార్థంబునం దగు.

వండక - పండక - కొట్టక - తిట్టక.

౪౦. తుమర్థ భావలక్షణంబులందు నుఁజీ యగు.

భావలక్షణంబు నా నన్యక్రియకు లక్షణ భూతంబగు క్రియ.

తుమర్థంబందును, భావలక్షణంబు నందును ధాతువునకు నుఁజీ వర్ణకంబగు.

తుమర్థంబు: చైత్రుండు వండను బోయెను. పాకక్రియార్థము పోయెనని యర్థము.

భావలక్షణము: చైత్రుండు వండ నతిథి వచ్చెను. ఇచట వంట లక్షణము, వచ్చుట లక్ష్యము.

౪౧. చేదర్థంబునందు, వృత్తంబగు భావలక్షణంబునందు న వర్ణకంబు ద్రుతాంతం బగు.

వానలు గురిసినం బంటలు పండును. వాఁడు రమ్మనినఁ బోయితిని.

౪౨. ఆనంతర్యంబున డు వర్ణకంబు ద్రుతాంతం బగు.

జాబిలి తోతెంచుడుం గువలయంబులు వికసిల్లె.

౪౩. చువర్ణకంబు ద్రుతాంతంబు క్రియాన్వయంబున శత్రర్థంబునం దగు.

చూచుచుం బోవుచున్నాఁడు - చూచుచుం బోయెను - చూచుచుం బోవఁగలడు.

౪౪. తృ వర్ణకార్థంబునం దెడి యెడు వన్నియ లగు.

ప్రవహించెడి వాఁడు - ప్రవహించెడు వాఁడు. ప్రహర్తయని యర్థము.

౪౫. వానికి లోపంబు బహుళంబుగా నగు.

ప్రహరించువాఁడు. ప్రహర్తయని యర్థము.

౪౬. ఉన్న కలజి న వర్ణకంబులు భవద్భావి శతృక్త వదర్థంబులం దగు.

ఉన్న వర్ణకంబు వర్తమానార్థక శత్రర్థంబునందగు - కలజి వర్ణకంబు భవిష్యదర్థక శత్రర్థంబునందగు - నవర్ణకం బుక్తవదర్థంబు నందగు.

ఇవి సత్వాభిధానంబునం దగునని యెఱుంగునది.

సుబంత వాచ్యంబు సత్వంబునాఁబడు.

వండుచున్నవాఁడు - వండఁగలవాఁడు - వండినవాఁడు.

౪౭. వ్యతిరేకి తృ వర్ణకార్థంబున నిజీ యగు.

వండనివాఁడు.

ఎడి ప్రభృతి వర్ణకాంతంబు లేడును ధాతుజ విశేషణంబులని ప్రాచీనులు వ్యవహరింతురు.

౪౮. లకారాదులు సకర్మకంబునకుం గర్తృకర్మంబులందును లాఁతికిం గర్తయందు నగు.

సకర్మకంబు నాఁ గర్మకాంక్షోత్థాపకంబు - అకర్మకంబు నాఁ గర్మా కాంక్షానుత్థాపకంబు.

౪౯. పడుజ్య నుబంధంబు కర్మంబు నందగు.

కొట్టఁబడుచున్నాఁడు - కొట్టఁబడుచున్నది - కొట్టఁబడుట - కొట్టఁబడనివాఁడు.

౫౦. గురువిరహితంబు లయి యయాంతంబులయిన యేకస్వర ద్విస్వరంబుల యించుగ్వక్రంబుల కియుడాగమంబు విభాష నగు.

ఏకస్వరధాతు ద్విస్వరధాతువుల మీఁది యించుగ్వక్రంబుల కియుడాగమంబు విభాషనగు. గురుమంతంబగు ధాతువునకును, యాంతంబగు ధాతువునకును మీఁది యించుగ్వక్రంబుల కియుడాగమంబురాదు.

భుజ్ - ఇయ్ - ఇంచు - భుజియించు. పక్షంబున భుజించు.

గున - ఇయ్ - ఇంచు - గుణియించు - గుణించు.

ఇంచుగ్వ్యవధానంబునం జేసి సంస్కృతధాతువులు వక్రపరకంబులు లేవని యెఱుఁగునది.

యాచ్ - అర్థ - ఇత్యాదులు గురుమతంబులు. వ్యయ - ఇది యాంతము.

యాచించు - అర్థించు - వ్యయించు.

జి - ఇంచు - అనుచో నిత్యంబగుటం జేసి యయుగమంబు రాఁగా యాంతంబగుటంజేసి యియుడాగమంబులేదని యెఱుంగునది.

కృతాకృత ప్రసంగి నిత్యంబు నాఁబడు.

నగు - ఇయ్ - ఇంచు - నగియించు - నగించు.

నగు - ఇయ్ - ఎను - నగియెను - నగెను.

పడు - ఇయ్ - ఎను - పడియెను - పడెను ఇత్యాదు లెఱుంగునది.

౫౧. పడ్వాదుల న వర్ణకంబున కత్వంబును, గడహల్లునకు ద్విత్వంబును విభాష నగు.

పడ్డ - పడిన - పడ్డను - పడినను.

పడు - ఇడు - చెడు - తగు - అను - కను - కొను - తిను - మను - విను - చను ఇవి పడ్వాదులు.

౫౨. క్రియాఫలంబు కర్తృగామి యగుచోఁ కొను ధాతు వనుప్రయుక్తం బగు.

ఇదియె యాత్మనేపదార్థంబని వ్యవహరింతురు.

వండుకొనుచున్నాఁడు.

౫౩. కొను ధాతువు పరంబగునపు డిగాగమంబు బహుళంబుగా నగు.

వండికొనియె - వండుకొనియె.

బహుళం బనుటచే యాంతంబునకు నిత్యంబు.

చేసికొనియె.

౫౪. ఇకార వక్రంబు లుక్తంబులందలవి పరంబులగుచోఁ యాకు సకారం బగు.

చేయు - చేసిరి - చేసి - చేసికొను - చేసెను - చేసెడిని - ఇత్యాదు లెఱుంగునది.

౫౫. చువర్ణకంబు పరంబగునపు డన్వాదుల కుత్వలోపంబేని, ను స్థానంబున బిందువేని విభాష నగు.

అన్చున్నాఁడు - అంచున్నాఁడు - అనుచున్నాఁడు - అన్చును - అంచును - అనుచును.

అను - కను - కొను - తిను - మను - విను - యివి యన్వాదులు.

౫౬. ఉన్న శబ్దంబు పరంబగునపు డుండు ధాతువునకు లోపం బగు.

ప్ర: ఉన్నాఁడు - ఉన్నారు - ఉన్నది - ఉన్నవి.

మ: ఉన్నావు - ఉన్నారు.

ఉ: ఉన్నాను - ఉన్నాము. ఉన్నవాఁడు.

౫౭. చేదాద్యర్థనాంతం బయిన యుండు న కున్నాదేశంబు విభాష నగు.

ఉన్నను - ఉండినను.

౫౮. తి దు ట లు పరంబులగునపు డన్వాదుల నుస్థానంబున సున్నయు, నుండు డు లోపంబును విభాష నగు.

అందురు - అంట - ఉందురు - ఉంట.

పక్షంబున అనుదురు - అనుట - ఉండుదురు - ఉండుట ఇత్యాది.

౫౯. ఇట బిందువుమీఁద త ద లకు నిత్యవైకల్పికంబు లయి ట డ లగు.

అంటిని - అనితిని - అండురు - అందురు.

ఉంటిని - ఉండితివి - ఉండురు - ఉండుదురు.

౬౦. ముజ్ఞు పరంబగునపుడు కో శబ్దంబు కొనునకు బహుళంబుగా నగు.

బహుళంబనుటచే దీనికి నొకానొకచో నతిచారంబని యెఱుంగునది.

౬౧. ముజ్ఞు పరంబగునపుడు దీర్ఘంబునకు హ్రస్వంబును, ముపర్ణకంబునకు మాముడియు నగు.

కొమ్ము - కొనుము - కొండు - కొనుఁడు.

౬౨. రు వర్ణకంబు పరంబగునపుడు సున్నమీఁది త ద డ ల యుత్వంబునకు లోపంబు విభాష నగు.

పోషింత్రు - పోషింతురు, కొంద్రు - కొందురు, కొండ్రు - కొండురు.

౬౩. సంస్కృతంబున కంగలాదుల కించు క్కగు.

సంస్కృతధాతువుల కంగలాదుల కించు గాగమంబగు.

పచించు - వచించు - త్యజించు - భజించు - అంగలించు.

అంగల - అడక - ఆరగ - ఆవుల - ఉంక - ఉగ్గడ - ఓసర - కార - గాల - జాడ - తిలక - తులక - పంక - పరిక - పలవ - అప్ప - ఒప్ప - ఆల ఇత్యాదు లంగలాదులు.

౬౪. ఇ ఉ ఋ ల కించుక్కు పరంబగునపు డ యు గ పు గరుక్కు లగు.

జి: జయించు. నీ: నయించు. ద్రు: ద్రవించు.

లూ: లవించు. ధృ: ధరించు. తౄ: తరించు.

౬౫. నిర్జి నామంబుల కయుగాగమంబు గలుగదు.

నిర్జికి, నామధాతువుల కయుగాగమంబు గలుగదు.

నిర్జించు - నుతించు - స్తుతించు.

ఈ జ్ఞాపకంబుచేతనే నామంబులకు ధాతుత్వ వివక్షయం దించు గాగమంబగునని యెఱుంగునది.

శయనించు - పయనించు.

౬౬. సంస్కృతంబునకు లఘూపధంబున కించుక్కు పరం బగునపుదు గుణం బగు.

ఆ - ఏ - ఓ. ఈ మూఁడును గుణంబులు నాఁబడు.

ఋ స్థానికంబగు గుణంబు ర పరంబయి యుండు.

సంస్కృతధాతూపధలకు ఇ - ఉ - ఋ అను వానికి సొరిదిని ఏ - ఓ - అర్ - అనునవి యించుక్కు పరంబగునపు డగునని యెఱుంగునది.

ఛిద్ - ఛేదించు, భిద్ - భేదించు, ఘుష్ - ఘోషించు, పుష్ - పోషించు, వృష్ - వర్షించు, హృష్ - హర్షించు.

౬౭. స్పృశికి గుణంబు విభాషనగు.

స్పర్శించు - స్పృశించు.

౬౮. లిఖ భుజ రుచ కృశంబులకు గుణంబు లేదు.

లిఖించు - భుజించు - రుచించు - కృశించు.

కుచధాతువునకు గుణంబులేదని యొకండు వక్కాణించె, నది గ్రాహ్యంబు గాదు.

౬౯. సృజికి నిర్మితిని గుణంబు లేదు.

చతుర్ముఖుండు ప్రజలను సృజించె. అతండు విషయంబుల విసర్జించె.

౭౦. సర్వంబునకుం బ్రేరణంబునం దించు క్కగు.

పచింపించు - వచింపించు - ఆవులింపించు - వండించు - పండించు.

౭౧. రంజాదుల యించుక్క కారంబునకు సబిందుకంబున కప్రేరణంబున ద్విరుక్తలకారం బగు.

రంజిల్లు - భాసిల్లు - వర్ధిల్లు - విలసిల్లు - రాజిల్లు.

ఈ యాదేశయోగంబున భిదాదు లకర్మకంబులగు.

భేదిల్లు - కంపిల్లు - సంధిల్లు.

౨౨. ఇంచుక్కు పరంబగునపుడు రంజాదుల యించుక్కునకు లోపం బగు.

లాదేశంబున కపవాదంబు.

రంజించు - భేదించు - సంధించు.

౨౩. చుగాగమం బాచ్ఛికంబున కసంయుక్త న ల డ రాంతంబునకుం బ్రేరణంబున బహుళంబుగా నగు.

వూను - వూనుచు - వూనించు.

తేలు - తేలుచు - తేలించు.

మగుడు - మగుడుచు - మగిడించు.

కుదురు - కుదురుచు - కుదురించు.

విను - వినుచు.

వక్ష్యమాణంబు పుగాగమంబు.

వినిపించు.

బాహుళకంబుచేఁ గొన్నింటికిఁ జుగాగమంబు లేదు.

అను - అనిపించు, తిను - తినిపించు, కను - కనిపించు.

దీని యత్వంబునకు దీర్ఘంబునగు.

కానిపించు.

౨౪. అట్లు పుగాగమంబును మాన్వాదుల కగు.

మాను - మానుపు - మానుచు, మను - మనుపు - మనుచు.

బాహుళకంబున దీని కించిక్కులేదు.

౨౫. చుక్పువర్ణంబులు పరంబులగునపు డిత్వంబున కుత్వం బగు.

౭౬. అట్లు చుక్కుగాగమంబు లడంగ్వాది మాయ్వాదుల కగునగుచో, వాని కడవ్రాలు లోపించు.

అడఁగు - అడఁచు - అడఁగించు, మాయు - మాపు - మాయించు.

అడఁగు - కరగు - కలఁగు - నలఁగు ఇత్యాదు లడంగ్వాదులు.

మాయు - ఉడుగు - కడగు - కుడుచు - బిగియు ఇత్యాదులు మాయ్వాదులు.

ఆఁగు ప్రభృతు లుభయగణంబులు.

బాహుళకంబునంజేసి కొన్నింటి కించుక్చుక్పుగాగమంబులు మూఁడును, గొన్నింటికందు యథా సంభవముగా రెండును, గొన్నింటి కొక్కటియు నగునని యెఱుంగునది.

ఆఁగు - ఆఁచు - ఆఁపు - ఆఁగించు.

రేఁగు - రేఁచు - రేఁపు - రేగించు.

పాయు - పాచు - పావు.

విఱుగు - విఱుచు.

చూచు - చూపు.

నేరుచు - నేరుపు.

మేయు - మేపు.

రేచు - రేపు.

కలియు - కలుపు.

తడియు - తడుపు.

తెలియు - తెలుపు ఇత్యాదు లెఱుంగునది.

౭౭. ఇంచుక్చుక్పుగాగమంబులు పరంబులగునపు డాగమాదేశ లోపంబులు పెక్కు దెఱంగులం గానంబడియెడి.

ఆగు - కావించు. వచ్చు - రావింపు - రప్పించు.

విన్నపము - విన్నవించు. మోకాలు - మోకరించు. కేక - కేకరించు.

పలవ - పలవరించు - పలవించు. ఆల - ఆలకించు - ఆలించు.

ప్రక్క - ప్రక్కలించు. నొచ్చు - నొంచు - నొప్పించు.

ఉండు - ఉనుచు - ఉంచు. డిగు - డించు - డిగించు.

పెరుగు - పెనుచు - పెంచు. తునుఁగు - త్రుంచు.

మునుఁగు - ముంచు - మునుచు.

మొగుడు - మొగుడుచు - మొగుచు - మోడుచు - మొగిడించు.

చొచ్చు - చొనుపు - చొప్పించు.

చినుఁగు - చించు - చింపు. త్రెగు - త్రెంచు - త్రెంపు.

తిరుగు - త్రిప్పు. చచ్చు - చంపు.

నిలుచు - నిలువరించు - నిలుపు. కొను - కొలుపు.

పోవు - పుచ్చు. పనుచు - పంచు. పనుపు - పంపు.

అనుచు - అంచు. అనుపు - అంపు.

అనుప్రయుక్తంబగు పోవునకుం బుచ్చు మాత్రంబగు.

మోసపోవు - మోసపుచ్చు ఇత్యాదు లెఱుంగునది.

౭౮. అన్వాదుల కించుక్కు పరంబగునపుడు పుగాగమం బగు, మానునకు విభాష నగు.

అనిపించు - అను - కను - తిను - విను. మానిపించు - మానించు.

౭౯. అడ్డాదుల కించుక్కు పరంబగునపుడు గుగాగమం బగు, అప్పాదులకు విభాషనగు.

అడ్డము - అడ్డగించు.

అడ్డము - ఓర - చిత్తము - పంతము - పెల్ల - బోర - మట్టము - మెళము ఇత్యాదు లడాదులు.

అప్ప - అప్పగించు - అప్పించు.

అప్ప - ఒప్ప - పల్లము - కోపము ఇవి యుప్పాదులు.

౮౦. ఆడోడు కూడుల డకారంబునకుం కుంజుక్కుపరం బగునపుడు రేఫం బగు.

ఆడు - ఆరుచు - ఆడించు.

ఓడు - ఓరుచు - ఓడించు.

కూడు - కూడుచు - కూడించు.

౮౧. చెడునకుం జుక్పుగాగమంబులను డాకలఘు రేఫంబు నగు.

చెఱుచు - చెఱుపు.

౮౨. పడునకుం జుక్కును డాకలఘు రేఫంబు నగు.

పఱుపు.

౮౩. శబ్ద పల్లవం బగు పడున కించుక్కు విభాష నగు, నగుచో డాకలఘు రేఫం బగు.

వెలువడు - వెలువరించు - వెలువఱుచు. చొప్పడు - చొప్పరించు - చొప్పఱుచు.

౮౪. ప్రేరణంబునం దించుక్కు మీఁద నించుక్కు లేదు.

ఇటనుటంజేసి ప్రేరణార్థంబయిన యితరాగమంబు మీఁదం బ్రేరణార్థేం చుగాగమంబగునని యెఱుంగునది.

నొచ్చు - నొంచు - నొంపించు. చచ్చు - చంపు - చంపించు.

౮౫. ఇత్వంబుగాని యెత్వంబుగాని కూడుచో, ననాద్యంబయిన యుత్వంబున కిత్వం బగు.

నిగుడు - నిగిడి - నిగిడె. మగుడు - మగిడి - మగిడె.

ఉడుగు - ఉడిగి - ఉడిగె. మునుఁగు - మునిఁగి - మునిఁగె.

౮౬. ముజ్జీత్తులు ముత్తు నాఁబడు.

౮౭. ప్రేరణేంచుక్కు పరంబగునపుడు పకారంబు చకారంబున కగు.

పచించు - పచింపించు. వచించు - వచింపించు.

పిలుచు - పిలిపించు. వలచు - వలపించు.

పత్వంబు హెచ్చునకుం గలుగదు. మెచ్చునకు విభాషనగు.

హెచ్చించు, మెప్పించు - మెచ్చించు.

౮౮. ఆగమాన్య చకారంబుల కద్విరుక్తంబులకు ముత్తు పరంబగునపుడు పవ లగు.

ఆగమంబు: పచింపఁడు - పచింపుము, అడఁపఁడు - అడఁపుము, అన్యము: పిలువఁడు - పిలుపుము.

౮౯. ఖండబిందువుమీఁది సిద్ధచకారంబునకు ముత్తు పరం బగునపుడు పకారంబు ప్రాయికంబుగ నగు.

తలఁపక - త్రేఁపక - తోఁపక.

ఏచునకు వైభాషికంబు.

ఏఁపక - ఏచక.

నోచునకుం గలుగదు.

నోచక.

౯౦. ఆగమ చకారంబునకు నెఱసున్న మీఁదిదానికి దుక్కు పరంబగునపుడు పకారంబు విభాష నగు.

ఆకర్ణింపుదురు - దంపుదురు - చింపుదురు.

పత్వంబురాని పక్షంబున వక్ష్యమాణ తాదేశంబు.

ఆకర్ణింతురు - దంతురు - చింతురు.

౯౧. అగు వచ్చు చొచ్చు చూచులకు ముత్తు పరంబగు నపుడు కా రా చొరు చూడు లగు.

అగు - కాఁడు - కమ్ము, వచ్చు - రాఁడు - రమ్ము, చొచ్చు - చొరఁడు - చొరుము, చూచు - చూడఁడు - చూడుము.

౯౨. ఇచ్చునకు సర్వంబున కీ యగు.

ఇచ్చు - ఈఁడు - ఇమ్ము.

ఈయ యనునాదేశంబు నొకానొకచోఁ గానంబడియెడి.

బలిమినీయని భూమి వలయపతుల.

౯౩. తే తేరులు తెచ్చున కగు.

తెచ్చు - తేఁడు - తేరఁగు - తెమ్ము - తేరుము.

౯౪. చావు నోవులు చచ్చు నొచ్చుల కగు.

చచ్చు - చాఁవడు - చావుము, నొచ్చు - నోవఁడు - నోవుము.

వక్ష్యమాణంబు ద్విత్వంబు.

నొవ్వండు.

౯౫. జిత్తు పరంబగునపుడు వాని వువర్ణంబు విభాషను లోపించు.

చాక - చావక - చాకుము - చావకుము.

నోక - నోవక - నోకుము - నోవకుము.

౯౬. అగున కను కనులకు ముజ్జీత్తులు పరంబులగునపుడు కానా కానలు విభాష నగు.

అపదాద్య సూత్రముచే గాకు వకారంబు.

వక్ష్యమాణం బౌత్వంబు.

కమ్ము - అగుము - అవుము - ఔము.

కండు - అగుఁడు - అవుఁడు - ఔడు.

నాఁడు - అనఁడు - కానఁడు - కనఁడు.

౯౭. నేరుచునకు లిడ్లాట్టులు ముత్తుం బరంబులగునపుడు రుచులకు లోపంబు బహుళంబుగా నగు.

నేచెను - నేరిచెను, నేచును - నేరుచును, నేరఁడు - నేరువఁడు.

౯౮. పోవునకు దుఙ్మత్తులు ముఙ్ఞుం బరంబులగునపుడు వులోపంబుం, బొద పద లును విభాష నగు.

పోదురు - పోవుదురు, పోఁడు - పోవఁడు, పోవుము - పోదము, పదము - పొమ్ము.

౯౯. అగు పోవుల కడవ్రాల కిద్వక్రంబులు పరంబగు నపుడు యకారం బగు.

వక్ష్యమాణం బైత్వంబు.

అయి - ఐ, అయిరి - ఐరి, పోయి - పోయిరి, పోయెను - పోయెడును.

౧౦౦. అగునకు వక్రంబు గూడుచో దీర్ఘం బగు.

వక్ష్యమాణంబు ద్విత్వంబు.

ఆయెను - అయ్యెను, ఆయెడును - అయ్యెడును.

౧౦౧. పిలుచు మొదలగువానికి ముత్తు పరంబగునపుడు కడ వ్రాయి బహుళంబుగ లోపించు.

పిలఁడు - పిలువఁడు - పిలుము - పిలువుము.

లేచునకు ముఙ్ఞు పరంబగునపుడు చులోపంబగు.

లెమ్ము - లెండు.

పిలుచు - నిలుచు - తలఁగు ఇత్యాదులు.

౧౦౨. లాఁతిచో సహితము కాదేశాదులు కానంబడియెడి.

కావుతను - కాతను, అగుట - కావుట, అగుడును - కావుడును, కానను - కావునను, అనుడును - అనవుడును - నావుడును ఇత్యాదు లెఱుంగునది.

౧౦౩. ఆచ్ఛికంబులం దయి యవులకు వక్రతమంబులు బహుళంబుగా నగు.

అయిదు - ఐదు, అయిరేని - ఐరేని, అవుడు - ఔడు, గవుసెన - గౌసెన.

౧౦౪. కలుగున కస్త్యర్థంబునందు లట్టు పరంబగునపుడు కల యగు.

ప్ర: కలఁడు - కలరు - కలదు - కలవు.

మ: కలవు - కలరు.

ఉ: కలను - కలము.

౧౦౫. త్రర్థంబునం గలాదేశంబు విభాష నగు.

ఎడి యెడు లకు లోపం బిట నిత్యంబు.

కలఁవాడు - కలుగువాఁడు.

౧౦౬. అస్త్యర్థంబునకు లజి మి క ని వడి వర్ణకంబులు పరంబు లగునపుడు లే యగు.

ప్ర: లేఁడు - లేరు - లేదు - లేవు.

మ: లేవు - లేరు.

ఉ: లేను - లేము - లేమి - లేక - లేని - లేవడి.

౧౦౭. వ్యతిరేకంబునందు వలచున కొల్ల విభాష నగు.

ప్ర: ఒల్లఁడు - ఒల్లరు - ఒల్లదు - ఒల్లవు.

మ: ఒల్లవు - ఒల్లరు.

ఉ: ఒల్లను - ఒలము - ఒల్లమి - ఒల్లక - ఒల్లని.

పక్షంబున వలవఁడిత్యాది. ఒల్లమి కొల్లఁబాటని ప్రయోగంబులం గానంబడియెడి.

౧౦౮. చువర్ణంబుతోడ దుగ్ధకారంబు తకారం బగు.

నిలుతురు - పిలుతురు - అడఁతురు - కడతురు - చింతురు - పెంతురు - పచింతురు - వచింతురు - చేతురు - కోతు రిత్యాదు లసాధువులని యెఱుఁగునది.

౧౦౯. పడుజీ కొను లొకానొకచో స్వార్థంబునం దనుప్రయుక్తంబు లగు.

చొచ్చు - చొరఁబడు. నిలుచు - నిలువబఁడు.

కూడు - కూడఁబడు. పండు - పండుకొను.

౧౧౦. తెంచు ధాతు వగ్వాదుల కనుప్రయుక్తం బగు, నగుచో నుత్వంబుపయిని దాని తకారంబు దకారం బగు.

అగుదెంచు - నెగయుదెంచు - పోవుదెంచు.

అగు - నెగయు - పోవు - చొచ్చు - పుచ్చు - తోఁచు - నడచు - పఱచు - మొలచు - వీచు ఇత్యాదులు.

౧౧౧. అభ్యాగతి నరుగ్వాదుల కయ్యాది యనుప్రయుక్తం బగు, నగుచో గువర్ణకంబు విభాషను లోపించు.

అరుదెంచు - అరుగుదెంచు. ఏతెంచు - ఏగుదెంచు. చనుదెంచు.

౧౧౨. అయ్యాది పరంబగునపుడు చువర్ణకంబు లోపించు.

చొచ్చు - చొత్తెంచు, పుచ్చు - పుత్తెంచు, తోఁచు - తోతెంచు.

౧౧౩. అద్దానికి ముత్తు పరంబగునపుడు తే తేరు లగు.

అగుదేఁడు - అగుదేరఁడు, అగుదెమ్ము - అగుదేరుము.

౧౧౪. భూతంబున లజీకి లిడంతంబగు, నగు ధాతు వనుప్రయుక్తం బగు.

ప్ర: వాఁడు రాఁడయ్యెను - వారు రారయిరి - అది రాదయ్యెను - అవి రావయ్యెను. మ: నీవు రావయితివి - మీరు రావయితిరి.

ఉ: నేను రానయితిని - మేము రామయితిమి.

౧౧౫. నుజ్యంతం బగు నగు ధాతువు క్రియావిశేషణంబుల కనుప్రయుక్తం బగు, నుజీకి విభాష నగు.

కాను - అనునది నుజ్యంతంబగు నగు ధాతువు రూపంబు.

౧౧౬. దానికి హ్రస్వంబు విభాష నగు.

లెస్సగాను - లెస్సగను, న్యాయముగాను - న్యాయ్యముగను. ఇట సరళంబు నిత్యంబు. చూడఁగాను - చూడఁగను - చూడను. ఇట స్వత్వంబు లేదు.

౧౧౭. ఉన్న కల న వర్ణకంబుల మీఁది తచ్ఛబ్ద వకారంబునకు లోపంబు విభాష నగు.

బాహుళకంబుచే నిట సంధి నిత్యంబు.

ప్ర: వండుచున్నవాఁడు - వండుచున్నాఁడు, వండుచున్నవారు - వండుచున్నారు.

మ: వండుచున్నవాఁడవు - వండుచున్నాఁడవు, వండుచున్నవారరు - వండుచున్నారరు.

ఉ: వండుచున్నవాఁడను - వండుచున్నాఁడను, వండుచున్నవారము - వండుచున్నారము.

ఇట్లు వండఁగలవాఁడు - వండఁగలాఁడు, వండినవాఁడు - వండినాఁ డిత్యాదు లెఱుంగునది.

౧౧౮. ధాత్వాదులకు ధాతువు లనుప్రయుక్తంబు లయి విలక్షణార్థాభిధాయకంబు లగు, నీయవి శబ్దపల్లవంబులు నాఁబడు.

కూరుచుండు - నిలుచుండు - పరుండు - పన్నుండు - ఆఁకొను - ఈఁకొను - ఈయకొను - ఇయ్యకొను - రక్కొను - త్రెక్కొను - మేకొను - మయికొను - మేలుకొను - మేలుకను - మేలుకాంచు - అలవడు - ఏరుపడు- చొప్పడు - వెలువడు - తలపోయు - వానపోయు - ఆపోవు - కొంపోవు - కొనిపోవు - విజయం చేయు - కయివ్రాలు - తూపొడుచు ఇత్యాదులు శబ్దపల్లవంబులు.

౧౧౯. చేదర్థయోగంబున లృట్టునకు లి ట్టగు.

ఆ ఋషీశ్వరుండు వచ్చెనా ఫలించుఁ గార్యముల్.

వాఁడు ఱేపు వచ్చెనేని నీవు కార్యంబు దొరఁకొనుము.

౧౨౦. ఆత్మార్థం బభిహితం బగుచోఁ దల్లింగసంఖ్యాభిధాయి వచనంబు ధాతువిశేషణంబుల కగు.

రాముఁడు రావణుం బరిమార్చి సీతయుం దాను సౌమిత్రి సహితంబుగం బుష్పకారూఢుం డయి సాకేతంబున కేతెంచె.

౧౨౧. ఆగతికంబులగు భ్వాదుల కిందు యోగంబు లేదు.

భూ - నృ - కృ - రేకృ - లోకృ - లోచృ - పచి - లప ఇత్యాదులకు, గతి విరహితంబులగు ధాతువులకు భాషం బ్రయోగంబులేదు.

ప్ర - పరా - అప - సమ్ - అను - అవ - నిస్ - నిర్ - దుస్ - దుర్ - వి - ఆఙ్ - ని - అధి - అపి - అతి - సు - ఉద్ - అభి - ప్రతి - పరి - ఉప - ఊరీ ప్రభృతులను సాక్షాత్ప్రభృతులును గతి సంజ్ఞాకంబులు, ప్రాదులిరువది రెండు నుపసర్గంబులు నాఁబడు.

ప్రభవించు - ఆవిర్భవించు - ప్రసరించు - సంస్కరించు - భస్మీకరించు - సాక్షాత్కరించు - అతిరేకించు - ఆలోకించు - ఆలోచించు - ప్రపంచించు - ప్రలపించు ఇత్యాదు లార్యప్రయోగంబుల నెఱుంగునది.

౧౨౨. వలయ్యాది క్రియలకుం, గర్త యగు భావంబునందు నుజీ యగు.

వలయ్యాది క్రియలకుం, గర్తృభూత క్రియావృత్తి యగు ధాతువునకు నుజీ వర్ణకంబగు. ప్ర:వాఁడు చూడవలయు - వారలు చూడఁగావలయు.

మ: నీవు చూడవలయు - మీరు చూడవలయు.

ఉ: నేను జూడవలయు - మేము చూడవలయు - మనము చూడవలయు.

వలయును - వలదు - కూడును - కూడదు - చెల్లును - చెల్లదు - తగును - తగదు ఇత్యాదులు వలయ్యాదులు.

సకర్మకంబునకు స్వరూప ప్రేరణార్థంబులు రెండును గొను పడ్వనుబంధంబులం దొక్కొక్కటి తోడ రెంటితోడం గూడుచో నగునవి యాఱుం గూడ రూపంబు లెనిమిదయ్యె. వాని సొరిది నుదాహరించెద:

కర్త్రర్థకము: మైత్రుఁడు వంటకమును వండెను.

ఆత్మనేపద కర్త్రర్థకము: మైత్రుఁడు వంటకమును వండుకొనియెను.

కర్మార్థకము: మైత్రునిచేత వంటకము వండఁబడియెను.

ఆత్మనేపద కర్మార్థకము: మైత్రునిచేత వంటకమును వండుకొనఁబడియెను.

ప్రేరణ కర్త్రర్థకము: చైత్రుఁడు మైత్రునిచేత వంటకమును వండించెను.

ప్రేరణాత్మనేపద కర్త్రర్థకము: చైత్రుండు మైత్రునిచేత వంటకమును వండించుకొనియెను.

ప్రేరణ కర్మార్థకము: చైత్రునిచేత మైత్రునిచేత వంటకమును వండింపఁబడియెను.

ప్రేరణాత్మనేపద కర్మార్థకము: చైత్రునిచేత మైత్రునిచేత వంటకము వండించుకొనఁబడియెను.

౧౨౩. గతిబుద్ధి ప్రత్యవసానార్థ శబ్దకర్మాకర్మంబుల కప్రేరణంబునం గర్త యగునది ప్రేరణంబునం గర్మం బగు.

పొందు మొదలయినవి గత్యర్థకంబులు.

తెలియు మొదలయినవి బుద్ధ్యర్థకంబులు.

తిను మొదలయినవి ప్రత్యవసానార్థకంబులు.

విను - చెప్పు - చదువు - మొదలయినవి శబ్దకర్మంబులు.

అకర్మకంబులు ప్రసిద్ధంబులు.

మైత్రుండు గ్రామంబు బొందెను.

చైత్రుండు మైత్రుని గ్రామంబుం బొందించెను.

లాఁతిచో సహిత మిక్కార్యంబు గానంబడియెడి.

మైత్రుండు పుడమి నేలెను -

చైత్రుండు మైత్రునిం బుడమి నేలించెను.

౧౨౪. అనభిహితకర్త కొకానొకచో షష్ఠి బహుళంబుగానగు.

రాముఁడు మిథిలం గనియె - రామునకు మిథిలం గనంబడియె - రామునిచే మిథిల గనంబడియెను.

మైత్రుండు తత్త్వంబుం దెలిసెను - చైత్రుండు మైత్రునకుం దత్త్వంబు దెలిపెను.

కన్వాదియోగంబునం బ్రయోజ్య కర్తకు షష్ఠి నిత్యంబుగానగు.

విశ్వామిత్రుఁడు రామునకు మిథిలం గానిపించెను.

కృష్ణుం డర్జునునకు విశ్వరూపంబు జూపెను.

అకర్మకంబున కప్రేరణంబునం దాత్మనేపద కర్మాను బంధంబులు లేమింజేసి రూపభేదంబు లయిదని యెఱుంగునది.

కర్త్రర్థకము: మైత్రుండు మనియెను.

ప్రేరణ కర్త్రర్థకము: చైత్రుండు మైత్రుని మనిచెను.

ప్రేరణాత్మనేపద కర్త్రర్థకము: చైత్రుండు మైత్రుని మనుచుకొనియె.

ప్రేరణ కర్మార్థకము: చైత్రునిచేత మైత్రుండు మనుపఁబడియె.

ప్రేరణాత్మనేపద కర్మార్థకము: చైత్రునిచేత మైత్రుండు మనుచుకొనఁబడియె.

వెండియుం బ్రేరణంబునం దించుగాగమంబు గలిగినచో సకర్మకంబునకుం బండ్రెండు, నకర్మకంబునకుం దొమ్మిదియు భేదంబులని యూహించునది.

ఇది క్రియా పరిచ్ఛేదము.



# కృదంత పరిచ్ఛేదము.

౧. కృత్తుల కర్థంబులు యథావ్యవహారంబుగ గ్రాహ్యంబులు.

ధాతువునకు విహితంబు డుఇ్భిన్న ప్రత్యయంబు కృత్తునాఁబడు.

కృత్తులకు వక్ష్యమాణంబులకు భావకర్తృ కర్మాద్యర్థంబులు మహాజన వ్యవహారానుసారిగా నెఱుంగునది.

ఆఁక - బంధనము - మొలక - నవోద్భిదము - ఏలిక - పాలకుఁడు.

కోరిక - వాంఛయు - వాంఛితంబును.

మూఁక - సంఘము. ఆడిక - నింద. ఓడిక - స్రోతస్సు.

౨. ఇటం గృత్కగతపవేములు పరంబులగునపుడు క గ చ య వ ల కు లోపంబగు.

కృత్సంబంధులగు కాదులు పరంబు లగునపుడు ధాతువునంతంబులగు కగచయవలకు లోపంబగు.

మీఁది లక్ష్యంబులం జూపంబడు.

౩. కవర్ణకం బలుగ్వాదుల కగు.

అలుగు - అలుక, ఆఁగు - ఆఁక, ఎఱుఁగు - ఎఱుక.

ఇట బిందు లోపంబు. ఇట్లు కొన్నింట గ్రహించునది.

కడఁగు - కఁడక, కలఁగు - కలఁక, కాఁగు - కాఁక, తునుఁగు -తునుక, నడచు - నడక, నలఁగు - నలఁక, పోవు - పోక, మడఁగు - మడక, మలఁగు - మలఁక, మునుఁగు - మునుక, మూఁగు - మూఁక, మొలచు - మొలక, వచ్చునకు రా - రాక, వంగు - వంక, వీఁగు - వీఁక.

ఇఁక క పులు పరంబులగునపుడు కనునకు దీర్ఘంబగు - కానుక.

కినియు ముదియుల కుత్వంబునగు.

కినియు - కినుక. ముదియు - ముసుక. ఇత్యాదు లలుగ్వాదులు.

౪. ఇమివర్ణకంబు కలుగ్వాదుల కగు.

కలుగు - కలిమి, ఓరుచు - ఓరిమి, కూరుచు - కూరిమి, నేరుచు - నేరిమి, ప్రేలుచు - ప్రేలిమి, బడియు - బడిమి, బ్రదుకు - బ్రదిమి, ఒడ్డు - ఒడ్డిమి, తాలు - తాలిమి.

౫. తృజ్వర్ణకంబు చేయ్వాదుల కగు.

చేయు - చేఁత, అలయు - అలఁత, కూయు - కూఁత, కోయు - కోఁత, గీయు - గీఁత, నేయు - నేఁత, పూయు - పూఁత, పోయు - పోఁత, మూయు - మూఁత, మేయు - మేఁత, మ్రోయు - మ్రోఁత, రోయు - రోఁత, లాయు - లాఁత, వ్రాయు - వ్రాఁత, వ్రేయు - వ్రేఁత.

౬. కువర్ణకం బడంగ్వాదుల కగు.

అడఁగు - అడఁకువ, ఎఱుఁగు - ఎఱుఁకువ, కలఁగు - కలఁకువ, నలుఁగు - నలఁకువ, పెనఁగు - పెనఁకువ, పొలయు - పొలకువ, మఱచు - మఱకువ, మెలఁగు - మెలఁకువ, లోఁగు - లోఁకువ, వేగు - వేకువ.

౭. టవర్ణకం బాడ్వాదులకగు నగుచో నంతలోపం బగు.

ఆడు - ఆట, ఊరు - ఊట, ఊఱడు - ఊఱట, ఏఁకరు - ఏఁకట, ఓడు - ఓట, తివురు - తివుట, తేరు - తేట, త్రిమ్మరు - త్రిమ్మట, పండు - పంట, పాడు - పాట, మండు - మంట, వండు - వంట, వేసఱు - వేసట.

అనుప్రయుక్తంబయిన యాటశబ్దంబు ప్రాయికంబుగాఁ గ్లీబసమంబగు.

కోలాటము - పోరాటము - మండ్రాటము ఇత్యాదులు.

౮. టు వర్ణకంబు పడ్వాదుల కగుచో నవి యాద్యక్షరశేషంబు లయి దీర్ఘంబు నొందు.

పడు - పాటు, చెడు - చేటు, అడుచు - అటు, కఱచు - కాటు, పొడుచు - పోటు, వయిచు - వాటు, ఏయు - ఏటు, ఓడు - ఓటు, వ్రేయు - వ్రేటు.

౯. ప వర్ణకంబు తిరియ్యాదుల కగు.

తిరియు - తిరిపము.

కలియున కత్వంబు నగు - కలపము.

పొలయు - పొలపము, మురియు - మురిపము, సొలయు - సొలపము, వలియు - వలిపము.

౧౦. త వర్ణకం బావులించు లోనగు వాని కగు.

ఆవులించు - ఆవులింత, ఇగిలించు - ఇగిలింత, ఓకిలించు - ఓకిలింత, కుళ్ళగించు - కుళ్లగింత, కుసిలించు - కుసిలింత, కొక్కరించు - కొక్కరింత, కొప్పరించు - కొప్పరింత, గిలిగించు - గిలిగింత. ఇత్యాదులెఱుంగునది.

౧౧. పు వర్ణకంబు మాయ్యాదుల కగు.

మాయు - మాపు, మేయు - మేపు, అడుచు - అడుపు, ఇంచు - ఇంపు, ఏఁచు - ఏఁపు, ఏచు- ఏపు, కను - కానుపు, కాచు - కాపు, చూచు - చూపు, తలఁచు - తలఁపు, తోఁచు - తోఁపు, త్రేఁచు - త్రేఁపు, త్రోచు - త్రోపు, పూఁచు - పూఁపు, పెనచు - పెనుపు, పొలుచు - పొలుపు, ప్రోచు - ప్రోపు, మెచ్చు - మెప్పు, మోచు - మోపు, వలచు - వలపు, వాచు - వాపు. ఇత్యాదులు మాయ్యాదులు.

౧౨. ఇక వర్ణకం బంజ్వాదుల కగు.

అంజు - అంజిక, అమరు - అమరిక, అరయు - అరయిక, అలయు - అలయిక, ఆడు - ఆడిక, ఓడు - ఓడిక, ఓపు - ఓపిక, కను - కానిక, కూడు - కూడిక, కోరు - కోరిక, పొందు - పొందిక, పోలు - పోలిక, తూను తూఁగునకగు - తూనిక.

ఇత్యాదు లంజ్వాదులు.

౧౩. అప్పాదులకు నజి యగు.

అప్పు - అప్పన, ఉజ్జ -ఉజ్జన, ఒప్పు -ఒప్పన, గట్టు - గట్టన, గడ -గడన, దట్టు - దట్టన, దీవ - దీవన, పాట - పాటన, మన్న - మన్నన, వీచు - వీవన.

౧౪. బడి యేల్వాదుల కగు.

ఏలుబడి - కట్టుబడి - కనుబడి - కొనుబడి - గిట్టుబడి - చెల్లుబడి - చేరుబడి - తగులుబడి - తీఱుబడి - పెట్టుబడి - పోబడి - మ్రొక్కుబడి - వచ్చుబడి - సాగుబడి.

౧౫. గడ చేర్వాదుల కగు.

చేరుగడ - తిరుగడ - తీఱుగడ - తేఱుగడ - తేగడ - మనుగడ - విడుగడ - వీడుగడ.

౧౬. ఇకి కోర్వాదుల కగు.

కోరికి - పూనికి - పోలికి - మనికి - వినికి - చూడు చూచు నకగు - చూడికి.

౧౭. వు వర్ణకంబు మన్వాదుల కగు.

మను - మనువు, కాచు - కాపు, కొలుచు - కొలువు, చచ్చు - చావు, తడయు - తడవు, నిలుచు - నిలువు, నొచ్చు - నోవు, పూచు - పూవు, ప్రుచ్చు - ప్రువ్వు.

౧౮. అ వర్ణకంబు గీఱ్వాదుల కగు.

గీఱ - ఊఁద - ఎండ - కాయ - చదియ - తునియ - పరియ - పాయ - పిడుచ - మీట - ముడియ - వరద - వ్రయ్య.

౧౯. అక వర్ణకంబు మాఱ్వాదుల కగు.

మాఱు - మాఱకము, అమ్ము - అమ్మకము, అంపు -అంపకము, పంచు పంపు - పంపకము, వండు (డకారంబు టకారంబగు) వంటకము, త్రోము - త్రోమకము, అద్దు -అద్దకము.

౨౦. డు వర్ణకం బాఱ్వాదుల కగునపుడు పకారంబు చయల కగు.

ఆఱు - ఆఱుడు, అమ్ము - అమ్ముడు, అల్లు - అల్లుడు, ఎక్కు - ఎక్కుడు, క్రుమ్ము - క్రుమ్ముడు, చోపు - చోపుడు, త్రొక్కు - త్రొక్కుడు, త్రోచు - త్రోపుడు, దంచు - దంపుడు, దాఁచు - దాఁపుడు, దిగు - దిగుడు, దోఁచు - దోఁపుడు, పెంచు - పెంపుడు -ప్రేపుఁడు, ప్రాఁకు - ప్రాఁకుడు, మాయు - మాపుడు, రాచు - రాపుడు. ఇత్యాదులు

౨౧. ఉ వర్ణకం బడుక్వాదుల కగు.

అడుకు - అంటు - ఒప్పు - ఒఱుగు - ఒసఁగు.

౨౨. వడి ప్రభృతు లిట్లెఱుంగునది.

వడి: కొలువడి - గెలువడి - నడవడి. వ్యతిరేకంబున లేవడి.

వి: తనివి - తెలివి - విరివి.

అవు: తగవు - నగవు - ఉఱవు.

ఇ: చేయి - వ్రాయి.

కలి: కనుకలి - వినుకలి. ఇత్యాదులు.

మహాజన వ్యవహారంబుల నెఱుంగునది.

ఇది కృదంత పరిచ్ఛేదము.



# ప్రకీర్ణ పరిచ్ఛేదము.

౧. పదాద్యంబులు ఋ ౠ వర్ణంబులు ర ల తుల్యంబులు.

అతఁడు ఋషి - ఇట సంధి లేదు.

ఆ ఋషి - ఇట యడాగమము లేదు.

వచ్చె ఋషి - వచ్చెన్ ఋషి - వచ్చెను ఋషి. ఇట ద్రుతమునకు లోప సంశ్లేష స్వత్వములు.

౨. ఆచ్ఛికపదంబులం దుత్తమంబు లగు రు లు డు ల ముందఱి యేత్వంబునకు హ్రస్వంబు విభాష నగు.

నల్లేరు - నల్లెరు, పల్లేరు - పల్లెరు, పెన్నేరు - పెన్నెరు, మానేరు - మానెరు, ఆడేలు - ఆడెలు, కుందేలు - కుందెలు, తోడేలు - తోడెలు, నాఁగేలు - నాఁగెలు, నేరేడు - నేరెడు, మారేడు - మారెడు, పూరేడు - పూరెడు, తంగేడు - తంగెడు.

౩. ఊ యే ల పయ్యెద తాయెతులం ద్రిక్క నామంబులందు యాకుం దాలవ్య వక్రయోగంబు లేదు.

స్పష్టము.

౪. ఊయేల యూయాల ల చాఁపుల నొండొంటికిం గుఱుచ యొండె నగు.

ఉయేల - ఊయెల - ఊయేల - ఉయాల - ఊయల - ఊయాల.

వక్ష్యమాణంబు యద్విత్వంబు.

ఉయ్యేల - ఉయ్యెల - ఉయ్యాల - ఉయ్యల.

౫. పయ్యెద పయ్యద.

౬. ఊ యే లాదుల దొలియచ్చుమీఁది హల్లునకు ద్విర్వచనం బొండె నగు.

ఉయ్యేల - ఊయేల, ఊయేల - ఊయెల, ఊయాల - ఊయల, ఆయె - ఏవిధము - ఓయ - ఓయారము - కోపు (ధనురగ్రము) - జాగర - తీనియ - తీయము - తేప(ప్లవము) - తేమ - తోయలి - దీవియ - నూవు - నోవి - నోవు - పూవు - పేయ - మోక(అంకురము) మోటిక - మోపు - వీయము ఇత్యాదు లూయేలాదులు.

౭. ఱ కారంబు క్రింది ఱ కారంబునకుం దుది ను లు ల క్రింది న ల లకు

లోపంబు బహుళంబుగ నగు.

అఱ్ఱు - అఱు, గొఱ్ఱియ - గొఱియ, కన్ను - కను, నన్ను - నను, పల్లు - పలు, విల్లు - విలు.

౮. అక్కటాదుల జేడ్డకు లోపంబు విభాష నగు.

అకట - అక్కట.

అక్కట - అట్టిక - అట్టుక - అట్టె - అయ్యో - అయ్యారె - అవ్వారి - ఇట్టిక - ఉప్పవడము - ఉమ్మి - ఎక్కసక్కియము - ఎక్కసెక్కియము - ఎక్కిరింత - ఎడ్డ - ఎన్నిక - ఎమ్ముక - కజ్జాయము - కట్టా - కట్టిక - కప్పురము - కమ్మటము - కమ్మతము - కువ్వాడము - కొట్టిక - కొమ్ము - కొయ్యగూర - గయ్యాళము - గిజ్జిగాఁడు - గుజ్జరాతి - చిట్టి - చిన్న - చిమ్మట - చెన్నఁటి - చెప్పుము - చెప్పుఁడు - చెమ్మట - చెల్లియలు - జవ్వాజి - జాబిల్లి - తమ్మటము - తమ్ములము - తల్లి - తుమ్మికి - తువ్వర - తెల్ల - దువ్వు - దివ్వియ - నవ్వు - నిద్దుర - నివ్వరి - నివ్వాళి - నువ్వు - నెట్టిక - నెమ్మలి - పవ్వళించు - పిన్న - పుల్లియ - పువ్వు - పెద్ద - పొట్టి - ప్రాకెన్న - ప్రెగ్గడ - బెగ్గడు - బొమ్మ - బొమ్మికము - బొమ్మిడికము - బొమ్మిడీకము - మజ్జ - మత్తాబు - మల్లారము - ముక్కు - మద్దియు - మెట్టిక - మొక్కరము - మొగ్గరము - మొల్లాము - రడ్డి - లొట్టిపిట్ట - వట్టి - వయ్యాళి - సన్నియ - సవ్వడి - సివ్వంగి - అట్టు - ఇట్టు - ఎట్టు - అప్పుడు - ఇప్పుడు - ఎప్పుడు - అన్ని - ఇన్ని - ఎన్ని - కొన్ని - మమ్ము - మిమ్ము - తమ్ము - అమ్మ - అక్క - అవ్వ - అయ్య - అప్ప - అచ్చొటు - ఇచ్చొటు - ఎచ్చొటు - అచ్చటు - ఇచ్చటు - ఎచ్చటు. ఇత్యాదులు లక్కటాదులు.

౯. జేడ్డక్కరంబుతోఁ బదాదిస్వరంబు గూడుచో జడ్డకు లోపంబు లేదు.

అఖ్ఖెత్తె - కన్నదరె - నన్నడిగె - పల్లొత్తె - విల్లందె.

౧౦. హాదులయు నీలుగు లోనగు వాని తొలి హల్లునకు లోపంబు బహుళంబుగానగు.

హడపము - అడపము, హరిదళము - అరిదళము, హలఁది - అలఁది, నీలుగు - ఈలుగు, నీలుగు - నెగయు, పొందు - పొనరు.

పూను పొదవుల కాదిలోపం బొకండు వచియించె నది యవిచార మూలకంబు.

౧౧. ఆరాటాదులం బ్రథమేతర దీర్ఘంబునకు హ్రస్వంబు విభాష నగు.

ఆరాటము - ఆరటము.

ఆరాటము - కక్కూఱితి - కేళాకూళి - కొమారుఁడు - కొమారిత - గంబూరము - పెండారము - బంగారము - బేహారము - వీటతాటము - సంతోసము.

౧౨. ఓయారాదులం దొలిదీర్ఘంబునకు హ్రస్వంబు విభాష నగు.

ఓయారము - ఒయారము.

ఓయారము - కేళాకూళి - కోలె - గూడారము - గోరువంక - పక్షి - జోహారు - నీలుగు - పేఁడ - బేహారము.

దీర్ఘమధ్యంబు - మాఱు - మూలుగు - మోఱకు - వీటతాటము - వీడియము - ఇత్యాదులు.

౧౩. అడంగ్వాదుల డాకు ణ కారంబు విభాషనగు.

అడఁగు - అనఁగు.

అడఁగు - కడఁగు - చిల్లాడము - తడగము - నాఁడెము - పోఁడి - మిడుఁగు - వదఁకు - మిడుఁగుఱు ఇత్యాదు లడంగ్వాదులు.

౧౪. దక్కులోనగువాని దాకు డ కారంబు విభాష నగు.

దక్కు - డక్కు.

దక్కు - దగ్గఱు - దాఁగు - దాకలి - దిగు - దిగ్గియ - దూయు - దెందము - దెప్పరము - దెప్పు - దొంగ - దొప్ప ఇత్యాదులు.

౧౩. ఏతాదులకు ముపర్ణకంబు పరంబగునపుడు దీర్ఘంబు విభాష నగు.

ఏతము - ఏతాము.

ఏతము - కళ్ళము - గాలము - గుడ్డము - గోణము - గోతము - జాజము - జుంజము - జోతము - తణగము - బొండ్లము - మండము - లాతము - వీణము ఇత్యాదులు.

౧౬. పదాంతంబు లయి యసంయుక్తంబు లయిన ను లు రు ల యుత్వంబునకు

లోపంబు బహుళంబుగ నగు.

ఇందు నురుల కుత్వలోపంబు ప్రాయికంబుగ హల్పరకంబులకుఁ జూపట్టెడు.

మ్రాన్పడె - మినువడె - మిన్వడె - వత్తురు వారు - వత్తుర్వారు - కారుకొనియె - కార్కొనియె - రాములు - రాముల్ - వనములు - వనముల్.

౧౭. ఆచ్ఛికంబులం బదమధ్యంబుల న ల డ ర ల యుత్వంబునకు లోపంబు బహుళంబుగ నగు.

కినుక - కిన్క, కానుక - కాన్క, చిలుక - చిల్క, కాలువ - కాల్వ, అడుగు - అడ్గు, కడుపు - కడ్పు, పెరుగు - పెర్గు, కూరుకు - కూర్కు.

౧౮. లాఁతియచ్చునకు సహిత మొకానొకచో నుడినడుమ లోపంబు గానంబడియెడి.

కలికి - కల్కి, ములికి - ముల్కి, బుడిపి - బుడ్పి, పొలఁతి - పొల్తి.

౧౯. అబ్బురాదులం దుత్వంబునకు లోపంబు విభాష నగు.

అబ్బురము - అబ్రము.

అబ్బురము - కప్పురము - అప్పుడు - ఇప్పుడు - ఎప్పుడు - చప్పుడు - నెత్తురు ఇత్యాదులు.

౨౦. చుక్కరక రు వర్ణంబునకు ముందఱి దు వర్ణంబు నుత్వంబునకు లోపంబు విభాషనగు,

నగుచోఁ దత్పూర్వంబు గురువు గాదు.

అదురుచు - అద్రుచు, ఎదురుచు - ఎద్రుచు, పదురుచు - పద్రుచు.

౨౧. జూదాదుల దాకు జకారంబు విభాష నగు.

జూదము - జూజము.

అవుదు - జవాది - జాది - జాదు - విరవాది.

౨౨. నిందయం దామ్రేడితంబు నాద్యక్షరములకు హ్రస్వదీర్ఘంబులకు గిగీ లగు.

కుంభకర్ణుఁడు - గింభకర్ణుఁడు, రావణుఁడు - గీవణుఁడు.

౨౩. పాదంబునం బ్రథమ ద్వితీయాక్షరములు వళిప్రాసంబులు నాఁబడు.

౨౪. య వ ల లు లఘ్వలఘువులు మైత్రిం బొరయు, రేఫంబులు పొరయవు.

౨౫. రేఫంబులు లఘ్వలఘువులుం దక్కుంగల విశేషంబులు నార్యవ్యవహారంబులఁ దెలియుట శ్రేయంబు.

శ్లో. శ్రీస్తనాఞ్చితకస్తూరిపఙ్కసఙ్కలితోరసే
పఙ్కజాక్షాయ నాథాయ వేఙ్కటేశాయ మఙ్గళమ్.

క.మును మదుపజ్ఞం బగుచుం
దనరినవ్యాకృతిని సూత్రతతి యొకకొంతం
దెనిఁగించి యిది ఘటించితి
ననయము బాలావబోధ మగు భంగిఁ దగన్.

క.తెనుఁగునకు శబ్దలక్షణ
మనయం బరయంగ వేడ్క నందినవారల్
తనరఁగ నీవ్యాకరణం
బున మూలంబయినకృతిని బోలఁ గనఁదగున్.

